# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

14-11-80 ఒక రూపాయి




దీపావళి సంచిక

# మీకోసం
# నూతన ప్రపంచం
# నిర్మిస్తున్నాం



పూర్తి ఆఫ్‌సెట్‌లో
జనవరి నుండి
వెలువడుతుంది

"నూతన ప్రపంచం" ఏలూరు రోడ్ విజయవాడ-520002

# చైతన్యవంతమైన సౌందర్యము

సహజానందాన్ని
అనుభవించండి
రంగుల రమ్యంలో
వైవిధ్యం నవ్యంలో
ప్రకృతి సౌన్దర్యంలో

ప్రత్యేకమైన
తగ్గింపు
20%
6-10-80 నుండి
6-11-80 వరకు



కో-ఆప్టెక్స్

# అలవాటు అయిన ఫిల్టర్ కాఫీ
# రుచిని అనుభవించండి రికరి రీతిలో



## రికరి®
## ఇన్‌స్టెంట్




*ఇది ఫిల్టర్ కాఫీ వలెనే*
*యెంతో రుచికరమైనది,*
*తేడాచెప్పడం చాలాకష్టం.*

SAA/FSL/R/1693

# ఉత్తరాలు

## సీరియల్

'మువ్వల మురళి' సీరియల్‌లో రచయిత్రి కేవలం హీరో హీరోయిన్ల వస్త్రధారణ వర్ణన మీద ఒక దస్తా కాగితాలు నింపారు. అప్పైన లాయరుగా కృష్ణసుమంత్ గొప్పతనాన్ని నిరూపించడాన్కి నడుం కట్టారు. న్యాయాలయం, న్యాయాధిపతి వంటి పదజాలం [న్యాయస్థానం, న్యాయమూర్తి పదాల బదులుగా] వాడుతూ కృష్ణసుమంత్ చేత న్యాయ సమరం చేయించారు రచయిత్రి . . .

ఎం. రాజా అండ్ రమణ [హైదరాబాద్]

* * *

'మువ్వల మురళి' సీరియల్ మేము ఊహించ లేని విధంగా మలుపు తిరిగింది. కృష్ణసుమంత్‌కు రోజాకు పరిచయమేర్పడినప్పటి నుండి వారిద్దరి మధ్య నడచిన సంభాషణల తీరు ప్రేయసీ ప్రియుల మధ్య జరిగినట్లు అపోహ కల్పించింది. కాని వారి అనుబంధం అన్నా చెల్లెళ్ల సంబంధం కావడం అనూహ్యం.

శ్రీమతి డి. ప్రమీలారాఘవరెడ్డి [కడప]

దీపం జ్యోతీ.... టి.వి.ఎస్.మూర్తి (తెనాలి




ఆంధ్రసచిత్రవారపత్రిక
వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]
శుక్రవారం : 14-11-'80
రౌద్రినామ సం. కార్తీక శు. సప్తమి.
సంపుటము 74 : సంచిక 9
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 54-60
ఆరు మాసాల చందా రు. 27-30
విడి ప్రతి వెల ఒక రూపాయి
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక



# మనలో మాట

## ○ కడుపు నిండింది ○ కథ, సశేషం ○ చలనం ○ మసి మరకలు ○ వరద బాధితులు.

ఇవీ, దీపావళి కథలపోటీ ఫలితాలు. మేము నిర్వహించిన దీపావళి కథల పోటీకి యీసారి, పోయినేడాదికన్నా యెక్కువ సంఖ్యలో కథలు వచ్చాయి! సంపాదకుని ఎన్నికలో పై ఐదు కథలు ఒక్కొక్కటి రూ 600 లు చొప్పున నగదు బహుమతులను చూరగొన్నాయి!

ఈ అయిదు కథలలో మూడు కథలు యీ సంచికలో చోటు చేసుకున్నాయి. మిగతా రెండు కథలు పై వారం వేస్తాము— ఐదు కథలు చదివిన పాఠకులు, వీటిలో ఏ కథ అత్యుత్తమం అనుకుంటారో దానికి మరో 600 రూపాయలు నగదు బహుమతి అదనంగా లభిస్తుంది. 'బ్యాలట్'లో ద్వితీయ, తృతీయ స్థానాలు అందుకున్న కథలకు ఆ వరుసలో రూ. 500 లు రూ 400 లు నగదు బహుమతులు అదనంగా అందుతాయి! కాగా, నాలుగు, ఐదు స్థానాలు పొందిన కథలకు రూ. 250 ల వంతున కన్సొలేషన్ బహుమతులందుతాయి.

కథలపోటీలో బహుమతులు అందుకున్న 'రచయిత' లను ప్రత్యేకంగా అభినందిస్తున్నాము. కథలపోటీలో విరివిగా పాల్గొని యీ పోటీని జయప్రదం చేసినందుకు రచయితలందరికి కృతజ్ఞతాభినందనలందజేస్తున్నాము!

దీపావళి కథలపోటీకి పంపిన కథలలో బాగున్నాయనుకొన్న మరికొన్ని కథలను మామూలు ప్రచురణకు తీసుకుంటున్నాము— వాటి వైనం ఆయా రచయితలకు ఉత్తరాలద్వారా తెలియజేస్తున్నాము. నిబంధనలను అనుసరించి పోటీ కథలను త్రిప్పిపంపే అవకాశం లేదనీ, వీటి వ్రాతప్రతులకోసం ఉత్తరాలు రాయొద్దని మరోసారి మనవి.

* * *

షరా మామూలే. మామూలు శీర్షికలు కొన్ని చోటు లేకపోడంచేత పై సంచికకి వాయిదా వేశాము.

**మా పాఠకులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు, రచయితలకు అందరికీ దీపావళి శుభాకాంక్షలు!**









# కడుపు నిండింది



దీపావళి కథల పోటీలో
రూ. **600** బహుమతి పొందిన కథ

**ఇంకా** తెల్లవారలేదు. గోడగడియారం నాలుగు కొట్టింది.

"అమ్మగోరూ !.... అమ్మగోరూ...."

సరస్వతమ్మ ఉలిక్కిపడి లేచింది. కళ్లు నులుపుకుంటూ వెళ్ళి తలుపు తీసింది. పని మనిషి బద్ధకంగా వొళ్ళు విరుచుకుంటోంది.

మర్నాడు పెందలకడే పనిలోకి రమ్మన్న సంగతి గుర్తొచ్చి తన మాట మన్నించిన పనిమనిషి స్వామి భక్తికి ఆశ్చర్యం వేసింది

"పనిలోకి రానేదండమ్మగోరూ !... పండక్కని అల్లుడూ, కూతురూ వొచ్చిరు. ఇయ్యాల ఇంటిపట్టునే వుండిపోవాల ఆ కబురు సెప్పిపోదామని వొచ్చినా..." కబురు చల్లగా చెప్పింది.

మరో రోజు అయితే సరస్వతమ్మ శాపనార్థాలు పెట్టివుండేదే! ఈ పని మనుషుల విశ్వాస ఘాతుకత్వాన్ని దుయ్యబట్టి వుండేదే! కాని నిన్నటి నుంచీ ఆమె మారిన మనిషి. ప్రపంచం నిండా ఎక్కడ చూసినా మంచే కనిపిస్తోంది. కారణం ?

ఎప్పుడూ బావురు మంటూ వుండే యిల్లు పిల్లాజెల్లాతో కళ కళ లాడుతుండటం, తన వాళ్ళందరూ తన చుట్టూతా వుండటం.

"సరేలే ! నువ్వుమాత్రం ఏంజేస్తావ్ ? నీకూ పండుగే ! నీయింటే సాయంత్రం వోసారి కనిపించు. మిగిలినవి పట్టుకు పోదువుగాని" వీధి తలుపు గడియ వేసి తిన్నగా భర్త మంచం వద్ద కొచ్చింది. ఇంత వయసొచ్చినా పసిపాపలా నిద్రపోగల ఆయన అదృష్టానికి నవ్వుకుంది. పండుగ పనులు మనసులో మెదిలేసరికి భయం వేసింది.

"మిమ్మల్నే !... లేవండీ...!"

"ఎందుకూ ?" ముసుగు తొలగించి బద్ధకంగా అన్నాడు దశరథరామయ్య.

"పనిమనిషి రాదు... పండుగ రోజు... బోలెడు పనులు."

"ఉంటే నేనేం చెయ్యనూ ?"

"అయ్యో రామా ! ఏదయినా చెయ్యొచ్చు. లేచి కొంచెం బాయిలర్ అంటించండి. తరువాత నీళ్ళు పట్టండి. కొళాయి ఆగి పోతుంది. ఈలోపు నేను మిగతా పనులు చూసుకుంటాను."

దశరథరామయ్య నిద్రమత్తు వొదిలి పోయింది. తనకు దమ్మిడీ పని చెప్పని భార్య ఈ రోజే పనులన్నీ పురమాయించడం లోని అవసరాన్ని గుర్తించాడు. వెంటనే లేచి కూచున్నాడు.

నిజానికి దశరథరామయ్య యిలాంటి యింటిపనులెన్నడూ చేసి ఎరుగడు. గెజిటెడ్ ఆఫీసరుగా పింఛను పుచ్చుకుంటున్నాడు. ముక్కుసూటిగా నడిచి, నిజాయితీ గల ఆఫీసరుగా పేరు పొందాడు. అందువల్ల ఉద్యోగంలో కొంత నష్టపోయినా పిల్లలు నలుగురూ పైకొచ్చారు. ముగ్గురు కొడుకులూ, ఒక కూతురూనూ. ఒక్కరూ ప్రస్తుతం వెయ్యి మైళ్ళకు తక్కువ దూరంలో లేరు. పెద్ద కొడుకు అయిల్





ఇండియా లిమిటెడ్‌లో ఆఫీసరు. ప్రస్తుతం సిమ్లాలో వుంటున్నాడు. రెండో వాడు కోయంబత్తూరు ఇంజనీరింగ్ కాలేజీలో అసిస్టెంట్ ప్రొఫెసర్. మూడో వాడు ఎయిర్ ఫోర్స్‌లో ఫ్లయిట్ లెఫ్టినెంట్. జాగ్వార్ విమానాల ప్రత్యేక ట్రయినింగ్ కోసం ప్రస్తుతం ఇంగ్లండులో వున్నాడు. ఇంకా వివాహం కాలేదు. అల్లుడు తుంబా రాకెట్ కేంద్రంలో ఇంజనీరు. దశరథ రామయ్యకు విశాఖపట్నంలో స్వంత ఇల్లుంది. ఎవ్వరిమీదా ఆధారపడనవసరం లేనంత రాబడి వుంది. ఏ చీకూ చింతా లేదు. కాని ఇంకా బోలెడు వయసు మిగిలివుంది. అందుకే జీవితం ఏదో వెలితిగా చప్పగా వుంది.

దశరథరామయ్య విశాఖపట్నంలో స్థిరపడటం ఒక పథకంతోనే చేశాడు. తన పిల్లలు వుద్యోగరీత్యా దేశంలో ఎక్కడెక్కడ తిరిగినా వాళ్ల పిల్లల్ని తన దగ్గరుంచుకుని చదివించాలని కోరిక.

“ఇక్కడ మంచి స్కూళ్లున్నాయ్రా! యూనివర్సిటీ వుంది. బ్రహ్మాండమైన స్టీల్ సిటీ కాబోతోంది. మీరెక్కడైనా తిరగండి, మీ పిల్లల్నిక్కడ నిశ్చింతగా వొదిలేసిపోండి. వాళ్ల చదువు బాధ్యత నాది...” అని వీలయినప్పుడల్లా చిన్నసైజు లెక్చరిస్తుంటాడు. ఈ రకంగానయినా తన పిల్లలు తన దగ్గర లేని వెలితి తీరుతుందని ఆశ. అయినా ఒక్కరూ తమ పిల్లల్ని వొదిలేసి వెళ్లడానికి ముందుకు రాలేదు. కారణాలు అనేకం. తల్లిదండ్రులు వాళ్లమీద సరైన శ్రద్ధ తీసుకోరని మాత్రంకాదు. అందుకే కారణం వెదకడానికి సోషియాలజీ డిపార్ట్‌మెంటువారు ఒక స్టడీ చెయ్యాలి.

జనరేషన్ గేప్ అనో, ఫేమిలీ సిస్టమ్ ఇంకా ఇంకా కంపార్ట్‌మెంటలైజు కాబోతోందనో ఎట్సెట్రా ఎట్సెట్రా సిద్ధాంతీకరిస్తారు.

చివరికో ఏర్పాటు కుదిరింది. అదొక జంటిల్‌మెన్ అగ్రిమెంటు లాంటిది. దేశం నలుమూలలా వున్న పిల్లలందరూ తమ పిల్లా జెల్లాతోసహా సంవత్సరానికొకసారి— అందరూ ఒకేసారి — తమ వద్ద గడపాలి. ఇది తూ... చా... తప్పకుండా అందరూ పాటించవలసిన నిర్ణయం. ఎవరికీ అభ్యంతరంలేని నియమం. అయిదేళ్లుగా అమలులో వున్న పద్ధతి. సంక్రాంతి పండుక్కి అందరూ కలవాలి.

ఎన్నడూ కాగితం మీద కలం పెట్ట సాహసించని సరస్వతమ్మ సంక్రాంతి ముందు మాత్రం తనే స్వయంగా అందరికీ వుత్తరాలు రాసుకుంటుంది. తల్లి ఆరాటం అర్థమవుతుంది గాబోలు, ఎన్ని యిబ్బందులున్నా ఈ పండక్కి రావలసిందే. ఈ పద్ధతి గుడ్డిలో మెల్ల అని సరిపెట్టుకుంది సరస్వతమ్మ.

* * *

బారెడు ప్రొద్దెక్కినా తలంట్లు పని పూర్తిగాక పోవటం సరస్వతమ్మ పని తెమలక పోవడం మాత్రం కాదు. పిల్లలు సహకరించక పోవటమే.

ఇదివర్లో ఇంట్లో ఒక కట్టుబాటుండేది. పండుగ రోజు తెల్లారేసరికల్లా స్నానాలు అయిపోవాలంటే అయిపోయేవి. పిల్లల్ని చదవండీ అంటే చదివేవారు. భోజనానికి రండిరా అంటే అందరూ వచ్చేశేవారు. మారుమాటుండేది గాదు. ఇంట్లో సరస్వతమ్మ నాయకత్వాన్ని అందరూ మన్నించేవారు. ఇప్పుడెవరి దారి వాళ్లది. క్రొత్త అలవాట్లూ, కొత్త పద్ధతులూ కనిపిస్తున్నవి. ఇల్లొక మినియేచర్ ఇండియాలా వుంది. ఒక మనవడు తెలుగూ హిందీ కలిపి మాట్లాడితే మరో మనుమడు అరవంలో తెలుగు కలుపుతాడు. ఒక మనుమరాలు ఇంగ్లీషు తప్ప మరో భాష మాట్లాడదు! ఒకడికి బ్రెడ్డూ ఆమ్లెట్ కావాలి. మరొకడికి ఇడ్లీ సాంబార్. ఇంకొకడికి రసగుల్లాలు కావాలిట. ఇహ తన గోంగూర పచ్చడేం కాను ? సరే వీళ్లంతా ఎక్కడెక్కడో పెరుగుతున్నారు. కొంతవరకూ అర్థం చేసుకోవచ్చు. కాని తన స్వంతపిల్లలు, వీళ్లూ మారిపోవడమేమిటి ? వీళ్ళు చిన్నతనంలో ఇలా వుండేవారా? పాచి మొఖాలతో కాఫీ త్రాగటమే ? ఈ దిక్కుమాలిన సంకరం అలవాట్లు అప్పుడుండేవా ? అసలు వీళ్లు తన పిల్లలేనా ? అని అనిపించేంతగా మారిపోయారు.

మొత్తంమీద స్నానాలు. పూర్తయి ఫలహారాలయ్యేసరికి పదిన్నరయింది. 'హమ్మయ్య' ఒక ఘట్టం పూర్తయినందుకు సరస్వతమ్మ వూపిరి పీల్చుకుంది. కోడళ్లు లాంఛనంగా వెళ్లి అత్తగారికి వంటలో సాయం చెయ్యడానికి సిద్ధమయ్యారు.

“మీరేమీ చెయ్యక్కర్లేదు. మీ పనులు మీరు చేసుకోండి. అంతేచాలు అవసరమయితే పిలుస్తాను” అంది సరస్వతమ్మ. అలా అంటుందని వాళ్లకు ముందే తెలుసు. అత్తగారు తమని అతిథులుగానే చూసుకుంటుంది గాని తమతో పనులు చేయించి అత్తరికం చెలాయించే మనిషి కాదని వాళ్లకు తెలుసు. అందుకే సరస్వతమ్మ అంటే కోడళ్లకు గౌరవం. ఆమె మాటకు విలువ. అలాగని సరస్వతమ్మ కూడా తన అభిప్రాయాలను వాళ్లమీద ఎన్నడూ రుద్దలేదు. వాళ్ల సంసారాల్లో వాళ్లకుపూర్తి స్వేచ్ఛనిచ్చింది.

సరస్వతమ్మ ఒక్కతే వంటింట్లో అష్టావధానం చేస్తోంది. కోడళ్లూ, కూతురూ కలిసి ఒకచోటచేరి స్త్రీల సమస్యలు చర్చించుకుంటున్నారు. మగవాళ్లంతా ముందు వరండాలో చేరి రాజకీయాలు చర్చిస్తున్నారు. ఇరాన్‌లో అమెరికన్ బందీలు మొదలు పంచదార కేజీ పదిరూపాయల వరకూ విషయాలు దొర్లిపోతున్నాయి. పిల్లజనం ఇల్లు పీకి పందిరేస్తున్నారు.

“ఇంద కాఫీ...” అంటూ సరస్వతమ్మ కాఫీగ్లాసు భర్తకందించింది. దశరథరామయ్య ఆశ్చర్యపోయాడు. ఇంత తల మునక పనిలో కూడా తన పదకొండు గంటల కాఫీ సంగతామెకు గుర్తున్నందుకు. ఉద్యోగం వదిలినా అలవాట్లు మాత్రం పోలేదు.

“మీ మామగార్కి కాఫీమీదే వుంటుంది నాయనా! ప్రాణం” అంటూ అల్లుడికి వివరించింది.

“సిక్సర్...సిక్సర్ ...” అంటూ ప్రవేశించాడొక మనవడు, ట్రాన్సిస్టరు భుజానవేసుకుని.

“ఏమిట్రా అది ?”

## దీపాలు !

కాలే కడుపే ప్రమిద
కారే కన్నీరే చమురు
నవనాడులే వత్తులు...
నిరాశా నిస్పృహలే నిప్పయి
వెలుగుతున్నాయి
నిరుపేదల కళ్లు
ఆ వెలుగులో వెతుకుతున్నాయి
సమతాభ్యుదయాల ఇండ్లు !

— తేజస్విత

# కడుపు నిండింది

"కపిల్ దేవ్ సిక్సర్ కొట్టాడు తాతయ్యా!"

"గుడ్ లెంగ్త్ బాల్...ఎండ్...ఎండ్... బ్యూటీఫుల్లీ డ్రైవెన్ బై కపిల్‌దేవ్ టు ఆన్ సైడ్ బౌండరీ ఫర్ ఎనదర్ ఫోర్.." కామెంటేటర్ గోల పెట్టేస్తున్నాడు. సముద్ర ఘోషలా వుంది కామెంటరీ.

"బయటకిపోయి వినరా" కొడుకుని గదమాయించాడు జ్యేష్టుడు. ట్రాన్సిస్టర్ బయటకు వెళ్ళిపోయింది.

"క్యా దేఖుతే హో... సూరత్ తుమ్హారీ..." మరో మనవడు మరో ట్రాన్సిస్టర్‌తో ప్రవేశం.

"బాబూ! సునీల్... మీ నాయనమ్మకి మోతలు పడవురా! బయటకు పోయి విను" దశరథరామయ్యకు భార్య గుండెదడ గుర్తొచ్చింది. ఈ ధ్వనులు తనకే వుక్కిరిబిక్కిరిగా వున్నవి. వెంటనే వంటగదివైపు నడిచాడు.

సరస్వతమ్మ చెవులు గట్టిగా మూసుకుని గోడకు చేరబడి కూర్చుంది.

"అమ్మాయిని పిలవలేక పోయావా?"

"ఒద్దులెండి... మీరు కూర్చోండి..." దశరథరామయ్య పీటవేసుకుని కూర్చున్నాడు. భార్యవంక ఆశ్చర్యంగా చూశాడు. ఎప్పుడూ ముక్కుతూ మూల్గుతూ మరోసారి కాఫీ అడిగితే గుని సే మనిషికింత వోపికెలా గొచ్చిందో? వెంటనే భార్యమీద జాలికలిగింది.

"దడగా వుందా?..."

"లేదు."

"నువ్వు మర్యాద చెయ్యలేదని ఎవ్వరూ అనుకోబోరు గాని, వూరికే వాళ్ళ హూనం చేసుకోకు."

"మీరు మరీనండీ..." నవ్వింది సరస్వతమ్మ నీరసంగా.

నిజానికి సరస్వతమ్మకు గుండెదడ విపరీతంగా వుంది. ఉక్కిరి బిక్కిరిగా భయంగా వుంది. అయినా వోపిక తెచ్చుకుని పనులన్నీ చేసుకుపోతోంది. తన పిల్లలకు తను స్వయంగా చేసిపెట్టుకుంటేనే ఆమెకుతృప్తి.

భోజనాలుపూర్తికావడంతో రెండో ఘట్టం పూర్తయిందని సరస్వతమ్మ మరోసారి 'హమ్మయ్య' అనుకుంది. ఒళ్ళంతా వులిసి పోయింది. అయిష్టంగానే భోజనం ముగించి నడుం వాల్చింది.

"బావగారూ! రమ్మీ ఆడదాం రండి. ప్రతిసారీ పండుక్కొచ్చి క్రొత్త బట్టలు తీసుకుపోవడం కాదు. ఈసారి మీ దగ్గర వసూలు చెయ్యందే వదల్ను..." అంటూ రెండోవాడు పేకదస్తాలు తీసుకొచ్చి ముందు పడేశాడు.

"ఉరేయ్ చిన్నన్నా! ఆయనకి మధ్య క్లబ్బులో రమ్మీ 'విజర్డ్' అని బిరుదిచ్చి సత్కరించారు. గెలుచుకోబోయి పోగొట్టుకునేవు గాక" హెచ్చరించింది చెల్లెలు.

"సరే చూద్దాం!... అన్నయ్యా రా!... నాన్నగారూ మీరూ ఒక చెయ్యి...!"

"స్టేక్ ఎంతోయ్?"




"మీ యిష్టం బావగారూ! ఆ ఛాయిస్ మీది."

"పది పైసలు. అంటే కవుంట్ పది రూపాయలు. డ్రాప్ రెండు రూపాయలు. మిడిల్ డ్రాప్ నాలుగు..."

"సరే..."

"క్యాష్ డవున్ ప్లీజ్... అరువుల్లేవు." హెచ్చరించాడు రెండోవాడు అందర్నీ.

"ఒక ప్రతిపాదన!" ఇంటి ఆడబడుచు వంక అంతా చూశారు.

"ఎవరు గెలిచినా డబ్బు నాకు రావాలి."

"ఇదెక్కడి న్యాయం తల్లీ!" కోడళ్ళిద్దరూ.

"చెబుతాను,కొంచెం ఓపికపట్టండిమరి."

"చెప్పు! ఎలాగైనా మీ ఆయన ఓడిపోతాడని భయమా?"

"అలాంటి భయం లేదుగాని వదినలూ వినండి. సస్పెన్సెందుకుగాని ఆ గెలిచిన డబ్బుతో అందర్నీ సినిమాకు తీసుకెడతాను."

మధ్యాహ్నం అంతా రమ్మీ జోరుగా సాగింది. ఎవరి భర్త దగ్గర కూర్చుని వాళ్ళు ఆడిస్తున్నారు పట్టుదలతో. సరస్వతమ్మకూ అక్కడ కూర్చోవాలనే వుంది. కాని సాయంత్రం టిఫిన్లు?

మొత్తం మీద రమ్మీవిజర్డ్ అల్లుడిగారి డవున్‌గా వుంది. కాఫీ, టిఫిన్లు పేకాటవద్దకే చేరాయి. అంతా హుషారు, నవ్వులు కేరింతలు.

"పోస్ట్!..."

దశరథరామయ్య సంతకంచేసి అందుకున్నాడు. ఇంగ్లండు నుండి కేబుల్ అది. మూడోవాడు అందరికీ (గ్రీటింగ్స్) పంపించాడు. సంతోషంతో నోట మాట లేదు సరస్వతమ్మకు. వాడు లేని వెలితిని ఈ కేబుల్ కొంతవరకూ తీర్చింది.

మరో అరగంట పేకాట సాగింది.

"స్టాప్ ప్లీజ్..." అంటూ అందరూ పోగొట్టుకున్న పూల్డ్ డబ్బుని లెక్కచూసింది ఆడబడుచు. ఎనభై అయిదు రూపాయల చిల్లర తేలింది.

"పధ్నాలుగు సినిమా టిక్కెట్లకీ, పధ్నాలుగు థమ్సప్‌కీ, పధ్నాలుగు పాప్‌కారన్‌కీ సరిపోతుంది. ఇక లేవండి ప్లీజ్. అందరూ అరగంటలో తయారవ్వాలి. అసలే సినిమా టిక్కెట్లు దొరకవు" అంటూ ఆడబడుచు పేకదస్తాలు తీసుకుంది.



# ఛాంపియన్ డిటర్జెంట్ కేక్ !

## 1అప్

**మరింత తెల్లదనంతో మీకు విజయం!**



అధిక తీవ్రంగా పని చేసే నురుగ, అధికం... తెలుపుచేసే పదార్థాలతో శక్తి, దాంతోనే శుభ్రతతో పాటు తెల్లదనాన్ని యిస్తుంది మీకు వన్-అప్. దాంతో తెల్లవాటికి మరింత తెలుపు, రంగువాటికి మరింత మెరుపూ వస్తుంది.







**మీకు డబ్బులో మరింత ఆదా!**



వన్-అప్, మరే యితర డిటర్జంట్ కేక్ కన్నా ఎక్కువకాలం మన్నుతుంది. ఎందుకంటే, వాడగానే తొందరగా అరిపోతుంది గనక. అంటే ఉతికే ప్రతిసారీ మీరు డబ్బును ఆదా చేస్తున్నారన్నమాటే!

**1అప్**

**ఉతకడంలో ఛాంపియన్!**

విట్కో లిమిటెడ్, కాలోల్ 389 330 గుజరాత్.

ASP/WL-1UP 261

మెసర్స్ కోరమాండల్ మార్కెటింగ్ ఏజెన్సీస్ ప్ర. లి. 15-1-503/ఏ 16-17, అశోక్ మార్కెట్, ఫీల్ఖానా, హైదరాబాదు-500 012.

"పధ్నాలుగురా ? మై గాడ్..." అంటూ హెడ్స్ కవుంట్ మొదలుపెట్టాడొక మనవడు.

"కరెక్ట్! తాతయ్యా నానమ్మలతో పధ్నాలుగురే" ధృవపరచిందొక మనవరాలు.

పదినిముషాల్లో అందరూతయారయ్యారు. వృద్ధ దంపతులు మాత్రం ఇంటిపట్టునే వుండిపోయారు. వరసగా మెట్లు దిగుతున్న తన బలగాన్ని చూసుకుని మురిసిపోయారు. తిరిగొచ్చాక వాళ్ళందరికీ దిష్టి తియ్యాలను కుంది సరస్వతమ్మ.

సరస్వతమ్మ రాత్రి వంట ప్రయత్నంలో వుంది. భర్త వంటింట్లో తోడుగా వుంటే ఎంతపనైనా సులువుగా చేసుకుపోగలదు.

"సింపుల్‌గా కానిచ్చెయ్యి..."

"మీరూరుకోండి. నేనేంకష్టపడిపోవటం లేదు. సంవత్సరానికి నాలుగైదు రోజుల భాగ్యం. తరువాత మీరూ నేనేగా మిగిలేది. పూర్తి విశ్రాంతేగా ?"

"నువ్వొట్టి పిచ్చిమొద్దువి. పిల్లలతో చెప్పి చేయించుకోవడం చేతగాదు. నలుగురికీ నాలుగు పనులు పురమాయిస్తే తేలిగ్గా అయిపోతుందిగా?"

"వాళ్ళంతా సరదాగా గడపడానికొచ్చారు. వాళ్ళకు పనులు పురమాయించనా? చాల్లే వూరుకోండి..."

"వాళ్ళతో చేయించుకోవడం ఇష్టం లేకపోతే నువ్వు చెయ్యగలిగినంతే చెయ్యి..."

"నా తృప్తికోసం అని వూరుకుందురూ. వూరికే సతాయించక."

"ఏమిటో నీ పిచ్చి నీ కానందం !"

"నాది పిచ్చేగాని... ఏమండీ! వాళ్ళంతా

# కడుపు నిండింది

వచ్చాక మీరు కూడా చిన్నమెత్తు పని ముట్టరు. బోలెడు అభిమానం. అందుకే ఆ మంచాలూ గట్రా యిప్పుడే వాల్చగూడదూ? ఆనక ఆపని నామీద వెయ్యకపోతే ?"

'నిజమే సుమా' అనిపించింది దశరథ రామయ్యకు. వెంటనే ఆ పని అందుకున్నాడు.

పనులన్నీ పూర్తయేసరికి రాత్రి తొమ్మిదయింది. పిల్లల రాకకోసం ఎదురుచూస్తూ వరండాలో కూర్చున్నారు దంపతులిద్దరూ.

ఆపురాపురుమంటూ వచ్చారు అందరూ. వెళ్ళేప్పుడున్న సరదా ముఖాల్లో ఇప్పుడు కనిపించడం లేదు. బట్టలు మార్చి భోజనాలకు సిద్ధమయ్యారు. సరస్వతమ్మ వడ్డన ప్రారంభించింది.

"సినిమా ఎలాగుందిరా సీనూ?" ఒక మనవణ్ణడిగాడు.

"గొప్ప బోర్ తాతయ్యా! సినిమా అంతా లవ్వే." అంతా నవ్వేశారు.

"అయితే సినిమా ఎలాగుండాలంటావ్?"

"ఫైటింగ్... డిషుం... డిషుం..."

"వాడికో ధర్మసందేహం నాన్నా" అంది కూతురు.

"యన్. టి. రామారావూ, అమితాబ్ బచన్ ఫైటింగ్ చేస్తే ఎవరు గెలుస్తారని ?" అంతా మరోసారి నవ్వేశారు. సరస్వతమ్మ కూడా హాయిగా నవ్వుతూ వడ్డిస్తోంది.

"బావగారూ! తినండి...తినండి... మళ్ళీ సంవత్సరం వరకూ ఇలాంటి పులావ్ దొరకదు" అన్నాడు రెండోవాడు. చెల్లెల్ని ఆట పట్టించడం అతని హాబీ.

"ఇన్సల్ట్‌రా చిన్నన్నా! అంటె నాకేం చేతగాదనేగా ?"

"అలా అన్నానా ? కాని బావగారు నిన్నటి నుండీ ఆపురాపురు మంటూ తినడమే నీ పాక పాండిత్యానికి ఋజువు."

"కరెక్ట్..." అంగీకరించాడు అల్లుడు మరి కొంచెం పులావు వేయించుకుంటూ.

"బావగారూ! మీ రేమీ అనుకోనంటే ఒక విషయం అడుగుతాను."

"అడగవోయ్!... అడుగు ... సందేహం దేనికి ?"

"మీరు చదువుతున్న రోజుల్లో కాలేజి హాస్టల్లో ఈటింగ్ పోటీల్లో ప్రథమ బహుమతి మీదేనని విన్నాను ? ఈ మధ్యనే తెలిసిందిలెండి..."

"అంతేనా నీకు తెలిసింది ?"

"అంత బొత్తిగా కొట్టిపారెయ్యకండి మరి! అందులో నాకూ అంతో యింతో ఘనత లేకపోలేదు."

"అయితే నాతో పోటీ కొస్తావా ?"

"ఎంత పందెం ?"

"రేపు సినిమా ఖర్చు."

"ఓకే! వడ్డించమ్మా!" అందరూ హార్దికంగా నవ్వుకున్నారు. పిన్నలూ పెద్దలూ పందేలు వేసుకుని మరీ తిన్నారు. పులావు గిన్నె ఖాళీ. పెరుగు ఆవడలు ఖతమ్. సేమ్యాపాయసం నిండుకుంది. కూరలు, అన్నం, సాంబారు, రసం అన్నీ ఖాళీ.

"బావగారూ! నేనోడిపోయాను."

"హుర్రే! హిప్...హిప్...హుర్రే..."

---

చూడమ్మాయ్! ఇలా లోనికొచ్చేయ్! పాపం ఇప్పటికే చాలా మంది చేతులు కాల్చుకున్నారు....!!!

శేఖర

ఏవిందా? ఏవిందా?

ఏలడవేంటి తెల్లారిందిక్కూ కళ్లు తెరవమండింక!

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. —సం.

# ప్రజా సేవలో



- ★ నిజమైన ప్రజల ప్రభుత్వం
- ★ స్వచ్ఛమైన, సమర్థవంతమైన పరిపాలన
- ★ ఏ స్థాయిలోనూ అవినీతికి ఆస్కారం ఉండదు
- ★ రైతులకు, పారిశ్రామిక కార్మికులకు న్యాయం
- ★ బలహీనవర్గాల అభివృద్ధి కార్యక్రమాలకు ప్రాధాన్యత

ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య నాయకత్వంలో ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, ఫలవంతమైన, సత్వర ఫలితాలను యిచ్చే పనిచేసే ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికి బహుముఖ కృషిని ప్రారంభించింది.

**అవినీతిపై పోరాటం :**

ఉన్నత పదవులలో ఉన్న ప్రజానాయకులపై వచ్చే ఆరోపణలను విచారించడానికి లోక్ ఆయుక్త, ఉపలోకాయుక్తలను ఏర్పాటు చేస్తారు. ఇందుకోసం వచ్చే రాష్ట్ర శాసనసభ సమావేశంలో ఒక శాసనాన్ని ప్రవేశ పెడ్తారు. అవినీతిని కనుగొనడానికి ఒక ఫ్లయింగ్ స్క్వాడ్‌ను ఏర్పాటు చేస్తారు.

**ఉజ్జ్వల భవిష్యత్తులోకి :**

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమాన్ని, సంజయ్‌గాంధీ ఐదు సూత్రాల కార్యక్రమాన్ని సమర్థవంతంగా, అర్థవంతంగా అమలు జరపడానికి వీలుగా ప్రత్యేక విభాగం ఏర్పాటు చేస్తారు.

**బలహీనవర్గాలకు చేయూత :**

ఒక సంవత్సరానికిపైగా ప్రభుత్వ భూములలో ఉన్న గుడిసెవాసులను తొలగించరు. ఈ భూములు ప్రభుత్వ ఉపయోగానికి అవసరమైన పక్షంలో ప్రత్యామ్నాయ వసతి కల్పిస్తారు. ప్రతి కార్మికుడు ఉద్యోగవిరమణ చేయగానే ఒక స్వంత యిల్లు పొందే విధంగా తోడ్పడడానికి ప్రభుత్వం కృషి చేస్తుంది.

**ఆపదలో ఉన్నవారికి సహాయం :**

కరువు నివారణ సహాయక చర్యల నిమిత్తం రు. 7.5 కోట్ల మొత్తాన్ని మంజూరు చేశారు. శ్రీకాకుళం జిల్లాలోని వరద బాధిత ప్రజలకు సహాయం అందజేయడానికి వీలుగా రు. 15 కోట్లు కేంద్ర సహాయాన్ని కోరారు.

**ధరల అదుపు :**

ధరల పరిస్థితిని సునిశితంగా పరిశీలిస్తూ, పరిస్థితిని వినియోగించుకుని వ్యాపారస్తులుగానీ, హోటళ్లవారుగానీ పేద ప్రజలను, మధ్యతరగతి ప్రజలను దోపిడీ చేయకుండా చర్యలు తీసుకుంటారు.

ఆంధ్రప్రదేశ్ మహత్తర విజయాల సాధనను కొత్త శకంలో అడుగు పెడ్తోంది. ప్రజలు ముఖ్యంగా బలహీనవర్గాల ప్రజల సంక్షేమానికి అత్యధిక ప్రాధాన్యం యిస్తారు. ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ఆశీస్సులతో ఆంధ్రప్రదేశ్ ఉజ్జ్వల భవిష్యత్తువైపు ఆత్మవిశ్వాసంతో ముందడుగు వేస్తూ రజతోత్సవం సంవత్సరంలో అడుగిడుతోంది.

సమాచార పౌర సంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము : ఆంధ్రప్రదేశ ప్రభుత్వము.

## పు వ్వు ల ది వ్వె లు

దీపావళి
దివ్వెల వరుసలు
ప్రతి ఇంటా
వెలుగులు
విరజిమ్ముతున్నాయి
వెన్నెల్లో విరిసిన
సిరిమల్లెల పువ్వుల
దివ్వెల్లా
ప్రతివాకిటా వెలిసాయి
బాణాసంచా
చిటపటల చిరునవ్వుల్లా
నరకాసురిని కది కటిక
చీకటి రాత్రిలా
వరులకది వెన్నెల రాత్రిలా
నవ్వుల పువ్వులు
రువ్వుతూ వెలిగిపోతోంది
దీపావళి

— ఎల్. పి. చంద్ర

## కడుపు నిండింది

పిల్లలంతా గంతులేశారు. అంతా నవ్వులు, ఆనందం, కేరింతలు, భుక్తాయాసం.

అంతా బయట వరండాలో కూర్చుని తాంబూలాలు వేసుకుంటున్నారు. పిల్లలు బాత్‌రూం ఖాళీకోసం పోటీలు పడుతున్నారు. సరస్వతమ్మ వంటిల్లు సర్దటంలో మునిగి పోయింది.

గడియారం పదకొండు కొట్టింది.

ఇల్లంతా నిశ్శబ్దం. ఎవరిగదుల్లో వాళ్ళు నర్దుకున్నారు. దశరథరామయ్య ఒక్కడూ వరండాలో కూర్చున్నాడు. ఎందుకో మనసు చికాగ్గా వుంది. చుట్టూరా ఆనందం పరవళ్ళు త్రొక్కుతున్నపుడు ఈ అప్రశుతేమిటి ? ఆయన గుండెల్ని ఎవరో పట్టి పిండినట్లుగా వుంది. వంటింట్లోకి నడిచాడు. ఫ్రిజ్ తెరచి చూశాడు. ఖాళీగా వుంది.

సరస్వతమ్మ వంటిల్లు సర్దటం పూర్తిచేసి రెండు గ్లాసులు మంచినీళ్ళు తృప్తిగా త్రాగింది.

"మీరింకా పడుకోలేదూ ?"

"చూడు పిచ్చిమొద్దూ! పొట్టిశ్రీరాములు 58 రోజుల నిరాహారదీక్ష తరువాత గాని చచ్చిపోలేదు. ఒక్కపూట భోజనం మానేసి నంత మాత్రాన మనుషులు చచ్చిపోరనీ నాకు తెలుసు. అయినా ఇంత బలగం వుండి నువ్వు తిన్నావా ? లేదా ? అని ఎవరికీ అనిపించక పోవటమే నాకు అర్థంకాని విషయం..."

"ఏమిటండీ ? మీరనేది ?"

"ఏమీలేదు. నువ్వుతినడానికేమీ మిగల్లేదు. ఇప్పుడు చేసుకునే వోపికా లేదు. అయినా నీ కడుపు నిండుగా వుంది కదూ... ?"

"అయ్యో ! నేను భోంచెయ్యక పోవడ మేమిటి ?"

"అబద్ధం చెప్పకు..."

"అయ్యోరామా ?..."

"ఆ ఫ్లాస్కు ఇలాతే. హోటలుకుపోయి ఓ బన్నురొట్టి, పాలూ తెసాను."

"ఈ వేళప్పుడెందుకండీ ఇవన్నీనూ ? నా కడుపు నిండుగా వుంది..."

"అవును ! కడుపు నిండింది" అంటూ ఫ్లాస్కు తీసుకుని విసురుగా బయటికి నడిచాడు దశరథరామయ్య.








దీపావళి కథల పోటీలో
రు. 600 బహుమతి పొందిన కథ

ఊళ్ళో దిగిన దగ్గర్నుంచీ వనజను చూడాలన్న ఆతృత ఎక్కువయింది నాకు. కానీ, వెంటనే వీలుపడింది కాదు. నేను అనుకోకుండా మా వాళ్ళ యింటికి బయలుదేరాను. వచ్చేముందు అమ్మా వాళ్ళకి ఉత్తరం వ్రాశాను గానీ, ఎప్పుడు బయలుదేరి వస్తున్నదీ వ్రాయలేదు. శ్రీవారి సెలవు విషయం ఖచ్చితంగా తేలక.

సెలవు విషయం ఎంతకీ తేలకపోవడంతో ఆయన నన్ను బయలుదేరి వెళ్ళమని చెప్పారు. సరే, యింటికి ఉత్తరం వ్రాసి బయలుదేరతానన్నాను. కానీ ఆ రోజు మంచిదనీ, మళ్ళీ నాలుగైదు రోజుల వరకూ మంచిరోజు లేదనీ, వెంటనే బయలుదేరమని చెప్పారు. ఇంత హడావుడిగా బయలుదేరడానికి గల కారణం— మా తమ్ముడి పెళ్ళి. లేకపోతే ఈ ప్రయాణం అసలు వుండేది కాదు.

పెళ్ళి యింకా వారం రోజులుంది. ఇంట్లో అప్పుడే సందడి మొదలయింది. ఒక్కళ్ళు కూడా తీరిక లేకుండా పనుల్లో మునిగి వున్నారు. నేను మాత్రం ఏ పనీ ముట్టుకోవడం లేదు ప్రయాణపు బడలికతో వుండడం మూలంగా, వూర్కే నిద్ర వచ్చేస్తోంది. మా యిద్దరి పిల్లల్నీ చెల్లెలు శోభకి వప్పగించి నేను హాయిగా పడుకున్నాను.

సాయంత్రం అయిదయింది. మెల్లగా లేచి, నిద్ర మొహాన్ని కడుక్కున్నాను. ఇంట్లో సందడి అంతగా లేదు. తమ్ముడూ, చెల్లాయి షాపింగ్ కి వెళ్ళినట్టున్నారు. నిద్రలో వుండగా వాళ్ళు నన్ను రమ్మని అడిగినట్టూ, నేను రానని చెప్పినట్టూ జ్ఞాపకం.

మా పెద్దాడ్ని కూడా శోభ వెంట తీసుకెళ్ళినట్టు తెలిసింది. చంటాడు గుడ్డ ఉయ్యాల్లో నిద్రపోతున్నాడు. (అది టెంపరరీగా చేసిన ఏర్పాటు).

అమ్మ వంటింట్లో పాట్లు పడుతోంది. నేను రైలు దిగి ఇంటికి జేరేసరికి తెల్లవారు జాము నాలుగయింది. వచ్చిన దగ్గర్నుండీ అందర్నీ నిద్రలేపి అన్ని కబుర్లు చెప్పుకున్నాం. స్నానాలు కానిచ్చిన తర్వాత మళ్ళా కబుర్లతో కాలం గడిచిపోయింది. భోజనం అయిన తర్వాత పడకేసాను.

ఇప్పుడు చెప్పుకుందుకి కబుర్లూ లేవు, మనుషులూ లేరు.



అప్పుడు వనజ జ్ఞాపకానికొచ్చింది. వనజ దగ్గరకు వెళ్ళి వచ్చేయొచ్చు ఓ గంటలో అనిపించింది. గంట అని అనుకుంటాగానీ, దానితో కబుర్లలో పడితే అసలు టైం తెలియదు. ప్రొద్దుట అంతసేపు ఇంట్లో వాళ్ళతో కబుర్లు చెప్పుకున్నా వనజ విషయం రాలేదు. మా ఇంట్లో దాని ప్రసక్తి తేవడం నాకు ఇష్టముండదు. ఎందుచేతంటే, దానిని తిడతారు. నాకు చాలా బాధగా వుంటుంది. వనజ విషయం వస్తేచాలు 'అదో మొదనష్టపు ముండ!' అంటుంది అమ్మ. ఈ వూరు వచ్చినప్పుడల్లా ఇంట్లోవాళ్ళకి అంతగా తెలీకుండానే వనజను చూసి వస్తుంటాను. వెళ్ళి వచ్చాక, ఎక్కడకు వెళ్ళావే అనడిగితే, అప్పుడు చెప్తాను.

ఇప్పుడు కూడా చెప్పకుండా బయలుదేరుదామనే వుద్దేశంలో వున్నాను. పాపం! ఎలా వుందో ఏమిటో!

ఉయ్యాల్లో చంటాడు అప్పుడే అటూ ఇటూ కదలడం మొదలెట్టాడు. మంచిదయింది. వెంటనే వెళ్ళి ఎత్తుకున్నాను.

అప్పుడు టైం ఆరయింది. ఎండాకాలం కాబట్టి ఇంకా వెలుతురూ, ఎండా పోలేదు.

## కథ, సశేషం

'అమ్మా! ఇప్పుడే అలా వెళ్ళొస్తానే!' అన్నాను.

'ఎక్కడికి వెళతావూ? ఓ ప్రక్కన చీకటి పడుతూంటే? ... పైగా చంటాడ్ని వేసుకుని' అంది అమ్మ వంటగదిలోంచి బయటికొస్తూ. నాకు వెంటనే ఏంచెప్పాలో తోచలేదు. 'వనజ దగ్గరకి!' అన్నాను, ఇక వేరే విషయం అప్పటికప్పుడు కల్పించిచెప్పలేక.

'ఆ మొదనష్టపు ముండ యింటికెళతానంటావేవిటే ప్రొద్దుగూకి?' చిరాగ్గా అంది.

'అదికాదే! పాపం వాళ్ళాయన పోయిన తర్వాత దాన్ని చూడనేలేదే ... ఓసారి పలకరించి వస్తాను' అన్నాను.

'కాస్త నామాట వినవే తల్లీ! ఈ వారం రోజులూ ఎక్కడికీ కదలకు' ప్రాధేయపూర్వకంగా అంది అమ్మ.

నాకు తెలుసు, విషయం తెలిశాక అమ్మ నన్ను వెళ్ళనివ్వదని. రేపు చెప్పకుండా చెక్కేయాలనుకుని అప్పటికి నా ప్రయత్నం మానుకున్నాను.

కాసేపటికి చెల్లాయి, తమ్ముడూవచ్చారు ఏవో చాలా కొన్నారు. కట్నం బాగానే కుదిరింది. అందుకే ఖర్చుపెడుతున్నారు.

రాత్రి భోజనాలయినయి. మా ఇద్దరు పిల్లలూ నిద్రపోయారు— చాలాసేపు గొడవ చేసి. గాలి లేకపోవడం మూలాన చాపలు తీసుకుని డాబామీద చేరాం నేనూ, శోభ. వనజ సంగతి కనుక్కుందికే నేను దానిని డాబామీదకు తీసుకెళ్ళాను.

ఇద్దరం కూర్చున్నాం. శోభకి వనజ అంటే సదభిప్రాయం లేదు. కారణం ఒక్కటే! అందరూ వనజని సరిగా అర్థం చేసుకోకుండా తిడుతుంటారు. అవి విని, వనజ చెడదనుకుంటుంది శోభ. వనజ సంగతులు మాత్రం తెలుసుకుంటూ వుంటుంది. వనజ ఇల్లు ఎంతో దూరంలేదు. రెండు ఫర్లాంగుల దూరం లోపే.

కాసేపు శోభతో దాని చీకాం చదువు ఎట్లా సాగుతున్నదో తెలుసుకుని, మరి కాసేపు ఆ కబుర్లు ఈ కబుర్లు చెప్పి చివరకు అడిగాను, 'వనజ అదే ఆఫీసులో పనిచేస్తోందా?'

'ఆఁ. అక్కడే చేస్తోంది. మళ్ళీ పెళ్ళి చేసుకుందట కూడా?' అంది.

# మీ జీవితంలో చీకటి పోవాలంటే

**ఇది చదవండి !**

రాత్రిపూట ఉన్నట్టుండి కరెంటు పోయింది. ఇల్లంతా కల్లోలమయింది. పిల్లలు ఎక్కడివాళ్ళక్కడే గొల్లుమన్నారు, గావుకేకలు పెట్టారు. కారణం ? చీకటి, చిమ్మచీకటి, కన్ను పొడుచుకొన్నా కనుపించని కటికచీకటి. చీకటంటేనే భయం. అది సహజం. అందుకే వెలుగుకోసం ప్రాకులాట, అగ్గిపెట్టెకోసం తడుములాట. చిమ్మచీకట్లో చిన్న అగ్గిపుల్ల గీస్తే వెలుగు కలుగుతుంది, చీకటి పోతుంది.

వెలుగును చూస్తే చీకటికి భయం. అందుకే వెలుగు కలుగగానే చీకటి పోతుంది. ఆ వెలుగు వెళ్ళిపోగానే చీకటి అలుముకొంటుంది. అంతేగాని చీకటి పోగానే వెలుగు రావడం కాదు. చీకటి తనంత తానుగా వెళ్లిపోదు. అంచేత చీకటి పోవాలంటే వెలుగు రావాలి, అది కావాలి. లేకపోతే చీకటి భయం పుట్టిస్తుంది. అలాగని చెప్పి, చుట్టూ ఉన్న చీకటిని చూచి భయపడుతూ, తిట్టుకొంటూ కూర్చోడంకంటే, ప్రయత్నించి ఓ చిన్న దీపం వెలిగించుకొంటే చీకటి చెదరిపోతుంది. భయం తొలగిపోతుంది.

మనిషి జీవితాన్ని ఆవరించే అంధకార పరిస్థితులు ఎన్నో ఉంటాయి. ఆ కారణంగా ఆ మనిషి జీవితంలో భయం తిష్టవేస్తుంది. ఆ హృదయంలో కాపురం చేస్తుంది. ఇక్కడోమాట చెప్పాలి. అదేమిటంటే, మనిషిలో భయంకర చీకటి సృష్టించేది మరణ భయం, మానవ భయాందోళనలన్నింటికి హేతువు మరణ భయం. ఉదాహరణకు, ఉద్యోగం లేకపోతే, ఆదాయం రాకపోతే, అన్నం దొరక్కపోతే, మంచం పడితే, మళ్ళీ లేవకపోతే—చావాల్సిందే ? పోనీ యివన్నీ ఉన్నాయనుకొంటే, అస్మబాటోయ్, బి.పి. వస్తుందేమోనని భయం. వస్తే చస్తానేమోనని భయం. ఇలా భయాందోళనలకు గురిచేస్తూ మనచుట్టూ ప్రబలుతుంటే మన పరిస్థితుల మన జీవితాల్లో చీకటిని సృష్టిస్తుంటాయి. ఆ చీకట్లోంచి మనం బయటపడేంతవరకు, వెలుగు చూచేంతవరకు భయంతో, అశాంతిలో కృంగిపోతూనే ఉండాలి.

మన జీవితంలో చీకటి పోవాలంటే మన హృదయాల్లో కాంతి కిరణాలు ప్రసరించాలి. వెలుగు విరులు వెల్లివిరియాలి. వెలుగుల జిలుగులే విరజిమ్మాలి. ఇంతకూ మనకు ఆ యోగం ప్రాప్తించడం ఏలాగూ? మన కోరిక సిద్ధించడం ఏలాగూ ? మనలో పీఠం వేసుకొని కూర్చొన్న చీకటినీ, సాక్షాత్తూ దాని రూపంగా మనలో ప్రత్యక్షమయ్యే భయాన్నీ పారద్రోలగించి, వెలుగు వెన్నెలలు మనకు పంచిపెట్టే ఆ దివ్య వెలుగు ఏదిమరి ? మనకు ఎలా లభ్యం అవుతుంది ఆ మహా వెలుగు ?

మీ జీవితంలోని చీకటిని శాశ్వతంగా పోగొట్టి, మీ జీవితమంతా వెలుగుమయం చేసి, మీ జీవన పథంలో వెలుగుజ్యోతిగా ప్రకాశించి, అంధకార భయంనుండి శాశ్వతంగా మీకు విముక్తి ప్రసాదించగల ఓ "మహా వెలుగు" ఉంది. ఆ మాటకొస్తే, మీకు మాత్రమే కాదు. లోకానికే వెలుగు ఆ దివ్య వెలుగు. ఆ వెలుగు మరెవ్వరో కాదు. "నేను లోకానికి వెలుగును" అని సెలవిచ్చిన యేసు భగవానుడే ఆ వెలుగు.

లోకానికి వెలుగైన ఆ లోకకళ్యాణమూర్తిని గూర్చి తెల్సుకొనేందుకు ప్రయత్నించడం — మనల్ని ఆవరించిన అంధకారంలో ఓ చిన్న దీపం వెలిగించేందుకు ప్రయత్నించడమే అవుతుంది. ఆ యేసుదేవుని విశ్వసించి, ఆయన విరజిమ్మే వెలుగును సంతరించుకోవడం మన జీవనజ్యోతిని వెలిగించుకోవడమే అవుతుంది. ఆయనే వెలుగు గనుక ఆయన మనలో ఉంటే మనలో చీకటి ఉండదు. చీకటి లేకపోతే భయమూ ఉండదు. భయం అంటూ ఏదీ ఉండకపోవడమేగా శాంతి సంతోషాలకు సంకేతం.

—బి. ఏ. ప్రతాప్‌కుమార్.

లోకానికి వెలుగైన ఆ పావన మూర్తి యేసు ప్రభువును గూర్చి చక్కగా తెలియజేసే 300 పేజీల సద్గ్రంథంకోసం
నేడే మాకు రాయండి. పోస్టేజీతోసహా ఆ గ్రంథాన్ని మీ కానుకగా మీకు పంపిస్తాం.

**ఏ. ఎం. జి.,**

**పోస్టుబాక్సు నెం. 1820, హైదరాబాదు - 500 020.**

VTS/P/84

# కథ, సశేషం

అదిరి పడ్డాను. 'మళ్ళీ పెళ్ళి చేసుకుందా?— ఎప్పుడు?' ఆశ్చర్యంలో వుండే అడిగాను.

'నాకు సరిగా తెలీదు. పది రోజులయి వుంటుంది. వాళ్ళాఫీసులో అతను. వనజ వయసే వుండొచ్చు అతనికి. రిజిష్టరు మారేజీ అని అన్నారు.'

నేను మాట్లాడలేక పోతున్నాను. వనజ మళ్ళీ పెళ్ళి చేసుకున్నందుకు నాకు కాస్త బాధగానే వుంది. మరీ ఇన్ని పెళ్ళిళ్ళా? సంఘంలో ఎంత చులకనయి పోతుంది. ఇది మూడో పెళ్ళి!

శోభ క్రిందికి వెళ్ళిపోయింది, అమ్మ పిలవగా. చాపమీద వెల్లికిలా పడుకుని ఆకాశం వంక చూస్తూ వుండిపోయాను.

వనజ గురించి పాతసంగతులన్నీ గుర్తుకు తెచ్చుకోవాలనిపించింది ఆ క్షణం.

* * *

నేనూ, వనజ మెట్రిక్‌లో క్లాసుమేట్స్. అప్పటికి దాని వయసు పద్దెనిమిదేళ్ళు వుండొచ్చు. బంగారు రంగుతో మెరిసిపోయేది. అందమైన కళ్ళతో అందర్నీ ఆకర్షించేది. వనజవాళ్ళు కాస్త కలవారనే చెప్పుకోవచ్చు. రెండంతస్తుల మేడ వుంది. వాళ్ళ నాన్నకు ఫాన్సీషాపు వుండేది. రాబడి బాగానే వుండేది. అయినా ఎప్పుడూ మంచి బట్టలు వేసుకునేది కాదు. చాలా నిరాడంబరంగా వుండేది. ఆ నిరాడంబరంలోనే ఎంత అందంగా వుండేదో! నిజంగా ఆ అందం ఎప్పటికీ చెరగనిది. వనజ, వాళ్ళనాన్నకి మొదటిభార్య సంతానం. అప్పటికి ఆయన ఫ్యూర్ ఫెలో! భార్యపోయిన తర్వాత, ఆయనా, వనజా పేదరికంతో మిగిలారు. అప్పటికి వనజ రెండు మూడేళ్ళ పిల్లట. ఆ సమయంలో కాంతమ్మ అనే ఆమె వనజ నాన్న భూషయ్యను ఆదుకుంది. ఆయన అందగాడు. కాంతమ్మకు కాస్త ఆస్తి వుంది. ఆ డబ్బుతో ఆయన ఫాన్సీషాపు పెట్టి మెల్లగా సంఘంలో ఎదగడం ప్రారంభించాడు. ఆయనకు, కాంతమ్మకూ ఓ ఆడపిల్ల కలిగింది. వనజను కాంతమ్మ కొట్టడం, తిట్టడం లాంటివి చెయ్యకపోయినా, ఉదాసీనంగా వుండేది. తల్లిలేని వనజకు అది ఎంతో అసంతృప్తిగా వుండేది. చిన్నతనం నుండీ ఆమె తన సవతి తల్లే అన్న భావం అలాగే పెరిగిపోతూ వచ్చింది. వాళ్ళిద్దరికీ ఒకళ్ళమీద ఒకళ్ళకి, ప్రేమానురాగాలు శూన్యం అని చెప్పవచ్చు.

వనజకు పద్నాలుగేళ్ళ వయసప్పుడే, భూషయ్య తన మొదటిభార్య తమ్ముడికిచ్చి పెళ్ళి అయిందనిపించాడు. ఈ పెళ్ళికి తొందరచేసింది కాంతమ్మే అని అందరి అభిప్రాయం. వనజకు తొందరగా పెళ్ళి చేసి

(52 వ పేజీ చూడండి)






# 21 లక్షల క్రొత్త వ్యక్తులు గత సంవత్సరం డెట్ బిళ్లను వాడారు

# దీనికి ఒక ప్రబల కారణం వుంది– డెట్ యొక్క ఉజ్వలమైన ఉతుకు

ఇపుడు ముందుకంటే ఎంతో ఎక్కువ మంది డెట్ బిళ్ల యొక్క ఉజ్వలమైన ఉతుకును ఇష్టపడుతున్నారు, వారంటారు; ఇది మరమిట్ల తెలుపును, ఎంతో ఎక్కువ పొదుపును ఇస్తుంది.

| ఉత్తమమైన డిటర్జెంట్ బిళ్లల వృద్ధి | |
|---|---|
| | క్రొత్త గ్రాహకులు |
| **డెట్ బిళ్ల** | **21,00,000** |
| రెండవ ఉత్తమ బిళ్ల | 14,00,000 |
| మొత్తము 49,00,000 క్రొత్త గ్రాహకులు | |
| మూలం: రిటైల్ స్టోర్ ఆడిట్ రిపోర్ట్: జనవరి-డిసెంబర్, 1979<br>వాడకపు ఆధారం: 1 బిళ్ల, ప్రతి నెల, ప్రతి వ్యక్తి | |

21,00,000 క్రొత్త వ్యక్తులు డెట్ బిళ్లను వాడడం మొదలెట్టారు.
మరి మీరు?




# డెట్ బిళ్ల

వాడండి
తెలుపును పొందండి

Shilpi-DM-14A/80 Tel

## మోసపోయిన మగువ

ఆత్తూర్‌కు చెందిన 20 ఏళ్ళ ఈశ్వరి అనే ఆమె తన మేనత్త వూరు నామక్కల్ వెళ్ళడానికి బయలుదేరి నాలుగో తేదీ సాయంకాలానికి సేలం చేరిందట. సేలంలో జాంజా మారుతాన్ని మరిపించే గాలి వాన ఆరంభమవడంతో రాత్రి ఏడు గంటల వేళ బస్ స్టాండులో వో మూల కూర్చున్నదట. ఆమె వూరుకు చెందిన పరశురామన్ అనే యువకుడు ఆమెను అక్కడచూసి ఇంత వానలో నామక్కల్ ఎలాగ వెళ్తావు. లాడ్జిలో నా రూములో ఉండి, తెల్లారి వెళ్ళవులే రా అని లాడ్జికి తీసుకు వెళ్ళి, తన రూములో కూర్చోపెట్టి, ఆ లాడ్జి వారితోబేరమాడి ఆమెను అమ్మేసి, డబ్బు తీసుకు చక్కా పోయాడట. ఆ రాత్రి పోలీసు సూపరింటెండెంట్ లతికాశరన్ సేలం లాడ్జిల మీద దాడి చేసిన సందర్భంలో యీ ఈశ్వరి దొరికిందట. ఆమె కథ విని, పోలీసుతోడు నిచ్చి ఆత్తూరుకు పంపారటా విడని.

### పిచ్చా...!?

పారిస్‌లో వో యువకుడు గత రెండేళ్ళ కాలంలో సుమారు వంద మందిని చెరిచాడట. ఈ యువకుడు భవనాల మెట్ల వద్దనో, లిఫ్టులోనో కాసుకుని, ఒంటరిగా వచ్చే ఆడదాన్ని పట్టుకుని, చెరిచి, ఆనక ఆమె స్థనాలలో గుండు సూదులు గుచ్చి పారిపోతాడట. ఇతన్ని పట్టుకోడానికి అక్కడి ప్రభుత్వం విశ్వ ప్రయత్నం చేసిందట. స్త్రీని చెరచడమే గాక, ఆమె స్థనాలలో గుండు సూదులు గుచ్చే రాక్షస వాంఛ ఏమిటో కూడా ఎవరికీ బోధ పడలేదట. అతను ఆకాశాన్నంటే భవంతుల మెట్ల మీద ఏదో వో అంతస్తులో కాపు గాచేవాడట. మొన్న మే నెల 22వ తేదీ వో 23 ఏళ్ళ అమ్మాయి తన గదికి తాళంవేసి బయటికి వెళ్ళడానికి లిఫ్టు వైపుకి వెళ్ళేసరికి అతనామె మీదవిజృంభించి, ఆమెను మెట్లవేపు లాక్కుపోయి, చెరిచి, రెండు స్థనాలలోను, రెండు గుండుసూదులు గుచ్చి చక్కాపోయాడట. ఈ మద పిచ్చి వాని కోసం ఆ ప్రభుత్వం తీవ్రంగానెతుకుతోందట.

### మోసానికో అవతారం!

చైనా దేశంలోని పెకింగ్‌లో 25 ఏళ్ళ హావ్ షెంగ్యాన్ అనే యువకుడు వోపల్లెలో కల మూఢ నమ్మకను కని పెట్టి, ఆ పల్లె వెళ్ళి తాను కేవలం గౌతమ బుద్ధుని అవతారమని, ఆ పల్లెనుద్ధరించడానికి వచ్చానని, చెప్పి నమ్మించి అక్కడివారి రోగాలను, ఆ వూరినీ తాను బాగు చేయవచ్చానని చెప్పి, అందుగ్గాను తనకు పూజకు పదార్థాలూ మద్యం, కన్నె పిల్లలూ కావాలని చెప్పి క. వారి పిల్లలనో ఏడుగుర్ని చెరిచాడట. అలా తనకు తమ శీలం అర్పించడం కేవలం గౌతమ బుద్ధుని మెప్పించడమేనని కూడా వారికి నచ్చ జెప్పాడట. ఇది బయటకు పొక్కిందట. చైనా చట్ట ప్రకారం ఒక స్త్రీని బలాత్కరించినా, ఏమార్చి అనుభవించినా లేక ఆ స్త్రీ సమ్మతంతో ఆమెను అనుభవించినా మూడు సంవత్సరాలనుంచి యావజ్జీవ శిక్ష వరకూ పడుతుందట. ఏమార్చిన కేసులకు మరణశిక్షలు కూడా విధించిన ఉన్నాయట. ●

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యం చిందే గట్టి పళ్ళు



# కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

## నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!



మిగిలిన తెల్లదనాలని మైమరపించే స్వచ్ఛమయిన
తెల్లదనం యిచ్చే స్కోర్—నీలం డిటర్జెంట్ బిళ్ల.
ప్రకాశవంతమయిన తెలుపు. తెల్లని తెలుపు.
సాటిలేని తెలుపు! స్కోర్ నీలం డిటర్జెంట్ బిళ్ల
మీ దుస్తుల మురికిని పోగొట్టి వాటికి
పరిశుభ్రమయిన తెలుపుని యిస్తుంది.
స్కోర్ నీలం డిటర్జెంట్ బిళ్లతో ఎన్నో బట్టలు
ఉతకవచ్చు. ఎంతో తెల్లగా. రంగు దుస్తులకి
కూడా మెరుపుతనం తెస్తుంది.

# విజయ సాధనలో తళ తళ మెరిసే తెలుపు!

# స్కోర్

**నీలం డిటర్జెంట్ బిళ్ల**

కేరళ స్టేట్ డిటర్జెంట్స్ & కెమికల్స్ లిమి.
(ఒక ప్రభుత్వ సంస్థ)




విజయ సాధనలో
తళ తళ మెరిసే తెలుపు!

FDS KSDC 3022A TEL



# చలనం

దీపావళి కథలపోటీలో బహుమతి రూ 500/-లు పొందిన కథ

## 'మా అమ్మ పోయిందిట'—

**తెలుగు అక్షరాల్ని కూడబలుక్కుంటూ కార్టూన్‌ని చదువుకుంటున్న కాన్వెంట్ పిల్లాడిలా చెప్పేడు, శ్రీనివాస్.**

నేను అదిరిపడ్డాను. ఈ పిడుగుపాటు నుంచీ నేను తేరుకొనేలోగానే మరో మాటా చెప్పేడు, 'ప్రభుదాస్ కంపెనీ'కీ నాకూ కూడా ఋణానుబంధం' తీరిపోయింది. నేనక్కణ్ణుంచి తప్పుకున్నాను.

ఈ వార్త నాకేమీ ఆశ్చర్యాన్ని కలిగించ లేదు. నేను అతనికేసి చూశాను. గోడవైపు తిరిగి పడుకున్నాడతను. పాంటూ, షర్టూ శరీరాన్ని అంటిపెట్టుకుని అలాగే వున్నై. ఒక్కొక్కప్పుడు — రాత్రుళ్ళు నిద్రపోయే ముందు దుస్తులు మార్చుకోడు అతను. అది అతని అలవాటు.

టైమ్ చూసేను. పదకొండూ ఇరవై అయింది.

'ఎప్పుడు జరిగిందిట — ఈ ఘోరం ?' అడిగేను.

'నాలుగు రోజులైంది. ఖాదర్ రాశాడు.'

శ్రీనివాస్‌ని ఇప్పుడేం అడిగినా అంతకు మించి సమాధానం లభించదు. ఇది నాకు తెలుసు. లైట్ తీసేసి నేనూ పడుకున్నాను.

శ్రీనివాస్ నేనూ బియ్యే మొదటి సంవత్సరంలో కలుసుకున్నాం. నేనూ అతనూ ఒకే గదిలో వుండేవాళ్ళం. నలభీమ పాకాలు చెయ్యడంలో ఆరితేరినవాడు శ్రీనివాస్. వేళకు కంచం దగ్గర కూర్చోవడంవరకే నా పని. అయితే, ఒక్కొక్కప్పుడు హఠాత్తుగా 'ఇవ్వాళా రేపూ వంట చెయ్యను' అనేవాడు. నేను హోటల్‌కి పోతూ పిలిస్తే — 'నువ్ వెళ్ళు. నేను రానులే' అనేవాడు. ఆ రెండు రోజులూ నిరాహారదీక్ష.

ఇద్దరమూ కాలేజీకి బయల్దేరితే — మధ్య దారిలో 'నువ్ పద. నేను రానులే' అనేవాడు, తక్కున ఆగిపోయి. 'ఏమైందిరా' అంటే — వేదాంతిలా ఓ నవ్వు నా మొహాన్న పారేసి, 'తోచడంలేదురా. అలా మంగినపూడి పోయొస్తాను' అని వెళ్ళిపోయేవాడు.

ఒక్కొక్క రోజు రాత్రి ఏ ఒంటిగంటకో గదికి చేరేవాడు. 'సినిమానా మళ్ళీ' అంటే— 'కాదు. రంగడి గుడిలో కూర్చున్నాన్లేరా' అనేవాడు ముభావంగా.

పరీక్ష రోజుల్లో సినిమాకుపోయొచ్చి కొండచిలువలా మంచాన్ని చుట్టుకుపోయేవాడు. పైగా, లైట్ వుంటే నిద్రపట్టదు. నన్ను మరొకరి రూమ్‌కి పోయి చదువుకోమని కసురుకునేవాడు.

ఒకసారి —

ఎందుకో మధ్యరాత్రి మెలకువ వచ్చింది నాకు. పక్కన మంచం ఖాళీగా వుంది. టైమ్ చూశాను. ఒకటేపది. గదితలుపు లోపల గడియవేసేవుంది. దాన్ని బయట నుంచి కూడా వేసి వెళ్ళవచ్చు. ఈ రహస్యం మా యిద్దరికే తెలుసు. లేచి బయటికివెళ్ళి చూశాను. అప్పుడప్పుడూ కాంపౌండ్ గోడకు ఆనుకుని వున్న బావి చప్టామీద టవల్

పరచుకుని పడుకుంటూ వుంటాడు — చల్లదనం కోసం. ఆ చుట్టూరా — కీచురాళ్ల రొద, దూరంనుంచి వినిపించే వివరం లేని సవ్వళ్లు, బూరుగుచెట్టుమీద కొంగలు రెక్కలల్లార్చే చప్పుళ్లు — వీటన్నింటినీ ఆనందిస్తూ ఆకాశంలో చుక్కల్ని లెక్కిస్తూ ఎడుకునేవాడు. ఆవేళ — అక్కడా లేడు. లోపలికొచ్చి పడుకున్నాను. తెలతెలవారుతుండగా వచ్చాడు. నేను మెళకువగా వుండటం గమనించి చెప్పేడు, 'వెన్నెల్లో అలా పెడనదాకా నడిచేను' అని. రానూ పోనూ ఎనిమిదిమైళ్ళు—ఎందుకువెళ్ళినట్టు ?

రెండో సంవత్సరం —

పరీక్షరోజులు—రాత్రి పదకొండు దాటింది. టీ తాగివచ్చి దీక్షగా చదువుకుంటున్నాను. టేబుల్ దగ్గరకూర్చుని ఏదో రాస్తున్నాడు శ్రీనివాస్. ఉన్నట్టుండి, 'మ్లానంగా' అంటే ఏమిటిరా అని అడిగేడు. నాకు అర్థం తెలీదు. అదే చెప్పేను. 'ఆ మాటెందుకు వచ్చింది' — ఉత్సుకతని ఆపుకోలేక అడిగేను. 'కథ రాస్తున్నాన్లే. చాలా కథల్లో— 'మ్లానంగా నవ్వింది, నవ్వేడు' అని రాస్తూ వుంటారు. అంటే ఏమిటా అని. 'ఇప్పుడు కథలెందుకు — పరీక్షకు చదువుకో" అన్నాను. 'మవ్ కానీ ఆ పని' అన్నాడు. నాకు తెలుసు. అతను వాదనను హర్షించడు. నేను మౌనం వహించాను.

బియ్యే చివరి సంవత్సరంలో —

కాలేజి లైబ్రరీలో ఇంగ్లీష్ లెక్చరర్ హరిప్రసాద్‌గారిని కలుసుకుని, 'మాష్టారూ— మీ అమ్మాయి సుందరి నన్ను ప్రేమిస్తున్నానంటోంది. నా గురించి మీ అభిప్రాయం ఏమిటి ? నాకు మాత్రం ఆమెపట్లా, మీపట్లా సదభిప్రాయం లేదు' అన్నాట్ట శ్రీనివాస్. హరిప్రసాద్‌గారు చండశాసనుడు. తన కూతురిమీద అభాండాలు వేసి ఆమె జీవితంతో చెలగాటమాడుతున్నాడని నానా హంగామా చేసి కాలేజి అంతా అదరగొట్టేశాడు హరిప్రసాద్‌గారు. నేను మా రూమ్‌లో అంతరంగికంగా 'ఏమిటిరా — ఈ గొడవంతా' అంటే, 'ఇందరు నమ్మనిది నువ్ నమ్మినా ఏం చేస్తావ్ ?' అని ఎదురు ప్రశ్న వేశాడు. తనలో తను గొణుక్కుంటున్నట్టు—'ఐ హేట్ ఆల్ దిస్' అన్నాడు.

మర్నాడు — శ్రీనివాస్‌ని కాలేజినుంచి 'డిబార్' చేశారు !

పది రోజుల తర్వాత —

నా గదినుంచి అంతర్ధానమైవాడు శ్రీనివాస్. వాళ్ల ఊరు — సిరిపురం — అడ్రస్‌కి ఉత్తరం రాశాను. వాళ్ల నాన్న — ఆచార్యులవారు సమాధానం రాశారు — అతను ఇంటికి రాలేదని, కాలేజీలో జరిగినదంతా తమకు తెలిసిందనీను.

బియ్యే అయిన తర్వాత—యూనివర్శిటీలో చేరడానికి వైజాగ్ వెళ్తుంటే విజయవాడలో ఖాదర్ కలిశాడు. అతనిదీ సిరిపురమే. శ్రీనివాస్ గురించి నేను అడిగేలోగావే అతను వివరాలు చెప్పేడు.

శ్రీనివాస్ మేరీ అనే అమ్మాయిని ప్రేమించి పెళ్లి చేసుకున్నాడు. వాళ్ల నాన్నా వాళ్ళు అతని పెళ్లిని నిరసించి కులభ్రష్టుడై పోయాడని వెలివేశారు. అతను అందర్నీ వదిలి ఎక్కడికో వెళ్లిపోయాడు. అప్పటి వరకూ ఎవరూ పట్టించుకోని శ్రీనివాస్




గురించి — సిరిపురమూ, సిరిపురంలో మనుషులూ, అతనికి అయినవాళ్లూ ఆలోచించడం మొదలైంది. లోకం శ్రీనివాస్ గురించి మాట్లాడసాగింది. అవీ ఇవీ కథల్ని అల్లుకునీ, అపవాదుల్ని ప్రచారం చేసుకునీ సంతృప్తి పడసాగింది.

— నేను విజయవాడలో లెక్చరర్‌గా చేరేను.

అన్నయ్య మద్రాస్ వెళ్తుంటే స్టేషన్‌కి వెళ్లాను. కంపార్ట్‌మెంట్‌లో నుంచి శ్రీనివాస్ దిగేడు! నేను ఆశ్చర్యంలోనూ, సంతోషంలోనూ మునిగిపోయాను.

ఇంటికి వచ్చేం.

విశేషాలు చెప్తాడని కళ్లు విప్పుకుని చూస్తూ కూర్చున్నాను అతనికేసి. 'ముందు— ఆకలవుతోంది; భోజనానికి పోదాం పద' అన్నాడు.

మాసికలు వేయడానికి వీలుపడని ఆకాశమంత అనర్థాన్ని శ్రీనివాస్ మొహంలో చదువుకున్నాన్నేను. అతని మనస్సులో కుంగిపోయిన పునాదులు — కళ్లల్లో నీలి నీడల్ని పరచటం గమనించాను. ఎండిపోతున్న చెట్టుని వళ్లీ కొత్తకొమ్మలు వేయమని అడగాలి కాబోలు అనిపించింది.

ఆ రాత్రి —

చాలా ముక్తసరిగా తన గురించి చెప్పేడు. తను కొంప కూల్చాడని రాద్ధాంతం చేసి బయటికి నడిపించారు — తల్లీ, తండ్రీ, అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్లూ.

ఆ బొమ్మలన్నీ ఒక మట్టితో తయారైనవి; ఆ పీలికలన్నీ ఒకే తానులోవి. తనే పరాయివాడూ, పనికిరానివాడూ అయినాడు. కారణం — మేరీ!

రెక్కలమ్ముకుందామనే ధైర్యంతో — ప్రపంచపు సుడిగుండలోకి దూకేడు. ఎక్కడా ఒదగని మనస్తత్వం — ఇక్కడా అక్కడా ఎన్నో జీవనభృతుల్ని మార్చింది. జీవితం వినోద ప్రదర్శనగా మారింది. చివరికి వంటలు కూడా చేసేడు. మేరీ కోసం తనను తాను నడిబజార్లో వేలం వేసుకునైనా ఊపిరి పీలుద్దామని ప్రయత్నించాడు. కానీ — వానపాములా అయింది తన పరిస్థితి. తుంచకుండా విడదీయడానికి వీలులేని పీటముడిలా తయారైంది దాంపత్య జీవనం.

మేరీ ఎవరితోనో లేచిపోయింది!

ఆశపెడితే చెయ్యి సాచినప్పుడు అరచేతిలో చరచినట్టయ్యింది!

రెండు నెలలు — వళ్లీ నా సాహచర్యంతో శ్రీనివాస్‌ని మనిషిని చేశాను. ఆడిటర్ రామారావుగారి దగ్గర చేరతానన్నాడు. సరే నన్నాను. అయినా నా మాట కాదనలేదు.

ఏడాది గడిచింది —

'ప్రభుదాస్ కంపెనీ' శ్రీనివాస్ తప్పుకున్న నాలుగో సంస్థ! ఎంత తరచి చూసినా — కారణమేదీ కనిపించదు. అతని జీవన యంత్రంలో వొదులైపోతున్న 'నట్టు' ఏదిటో — నాకు అవగతం కాలేదు.

* * *

తెల్లవారుఝామునే శ్రీనివాస్‌ని లేపేను. 'మనం సిరిపురం పోతున్నాం — బయలుదేర' మన్నాను.

'ఆ ముచ్చటనీ చూడాలనివుంటే అలాగే కానీ' అని బయల్దేరేడు.

— అడ్డరోడ్డు దగ్గర బస్ దిగేసరికీ బారెడు పొద్దెక్కింది. రోడ్డువారగా వున్న సిమెంటు పలక — 'సిరిపురం — 3 కి. మీ.' అని బాణం గుర్తుతో కుడివైపు ఉన్న ఊరుని సూచిస్తోంది.

డొంక వెంట నడక మొదలెట్టాం శ్రీనివాస్ గబగబా అడుగులు వేస్తున్నాడు. నేను పరిసరాలు పరికిస్తూ నెమ్మదిగా నడుస్తున్నాను.

డొంకకు అటూ ఇటూ — నీళ్లు నిలవ గట్టిన మాగాణి పొలాలూ, గట్లమీద ముళ్ల కంచెలూ, అక్కడక్కడా ఎత్తుగా నిలిచిన పుట్టలూ, బాటవెంట పల్లేళ్లూ, జిల్లేళ్లూ — దర్శనమిస్తున్నై.

ఎండ చిటచిటలాడుతోంది. పంటకాలవ వంతెన దాటుతుంటే — ఎవరో రైతు పలకరించాడు — శ్రీనివాస్‌ని. 'ఇప్పుడేనా అబ్బాయ్‌గారూ రావడం' అని, 'ఆ యమ్మ అదృష్టవంతురాలు. పుణ్యస్త్రీగా ఎళ్లిపోయింది' అంటూ నెమ్మదిగా ముందుకు కదిలేడు. శ్రీనివాస్ శూన్యంలోకి చూస్తూ నడుస్తూ వున్నాడు. నాకు తెలిసిన శ్రీనివాస్ కుటుంబం, వాళ్ల యింటి పరిస్థితులూ నా కళ్లముందు మెదిలినై.

ఆచార్యులవారు సిరిపురానికీ, చుట్టు పక్కల రెండు మూడు సివార్లకీ ఆయుర్వేద వైద్యుడు. వేణుగోపాలస్వామి గుళ్లో పురాణం చెప్తాడు. ఆయనకి ఆ గుడి అర్చకత్వం వుంది; ఐదుగురు ఆడపిల్లలు, ముగ్గురు మగపిల్లలూ వున్నారు; వృద్ధులైన తల్లీదండ్రీ వున్నారు; మంచంలో తీసుకుంటున్న మేనత్త వుంది; రోగిష్టి పెళ్లాం వుండేది.

ఎనిమిదిమంది సంతానంలో మూడోవాడు — శ్రీనివాస్. వాళ్లన్నయ్యకి పెళ్లయింది, ముగ్గురు పిల్లలు; అక్కకి పెళ్లి కావాలి. ఆమెకి పెళ్లి భయం. ఎప్పుడూ



సోవియట్ యూనియన్‌లో భారత రాష్ట్రపతి సతీ సమేతంగా జరిపిన పర్యటన పౌరులను, పాఠకులను కూడా యెంతో ఆకర్షించింది. ఈ రెండు చిత్రాలలో శ్రీ నీలం సంజీవరెడ్డి అక్కడి కళాకారులతో ఎంతగా కలసిపోయింది, వారంతా ఆయనను ఎంత ఆప్యాయంగా ఆదరంగా గౌరవించింది గమనించ వచ్చును. మొదటి చిత్రంలో శ్రీ రెడ్డి, శ్రీమతి నాగరత్నమ్మ దంపతులు జార్జియాలోని టిబిలిసి లో అక్కడి ప్రముఖుల కళాకారుల స్వాగత సత్కారాలను అందుకుంటున్నారు. రెండో చిత్రంలో వారితోపాటు ఉల్లాసంగా గిటార్ లాంటి స్థానిక వాయిద్య మొక దానిని పలికిస్తున్నారు.

పూజలూ, పునస్కారాలూ – స్నానాలూ జపాలూ. చదువా – పెద్దబాలశిక్షతో సరి. మిగిలిన ఆడపిల్లల్ని–ఏడోతరగతితో 'ఇకచాల్లే' అన్నారు. సిరిపురంలో అప్పర్ ప్రైమరీ స్కూల్ వుండటం దానికి కారణంట. పెద్ద కొడుకు పెళ్లికాగానే, పెద్దకూతురికీ పెళ్లి చెయ్యాలని చాలా ప్రయత్నాలు చేశారు – ఆచార్యులవారు. కానీ ఏవీ ఫలించలేదు. ఆమె ససేమిరా పెళ్లికి ఒప్పుకోలేదు. ఆమె 'ఆమె పారాయణలు', ఆమె స్తోత్రాలతోసరి. రెండో పిల్లకి 'దయ్యం' పట్టిందిట. చెయ్యని వైద్యం లేదు, మొక్కని దైవంలేదు. ఏదైతేనేం,– పెద్దకొడుకు పెళ్లి తర్వాత – ఆచార్యులవారి ఇంటి ద్వారబంధం ఏ శుభకార్యానికీ తోరణపు మండకి నోచుకోలేదు.

ఇవన్నీ నాకు ఆచార్యులవారు అప్పట్లో అడపా దడపా బందరు వచ్చినప్పుడు తెలియ జేసిన సంగతులు.

శ్రీనివాస్ గురించి ఎక్కువగా ఆలో చించినప్పుడూ, అతని 'స్వయంపాకం' తత్వాన్ని గురించి వాలో నేను తర్కించు కుంటూ వుండేటప్పుడూ – అతని ప్రవర్తనకి వాళ్ల కుటుంబ పరిస్థితులు కొంతవరకూ కారణమేమో అనిపిస్తూ వుండేది నాకు !

– 'ఊళ్లో కొచ్చాం' అన్నాడు శ్రీనివాస్. చింతల తోపులోంచీ వెళ్తున్నాం మేము.

సిరిపురంలో సుమారు వో వంద గడప వున్నట్టుంది. చెట్టునుంచీ రాలిన మద్ది కాయల్లా అక్కడొకటీ ఇక్కడొకటీ వున్నై ఇళ్లు. వాటిల్లో మిద్దెలూ వున్నై; పూరి

# చలనం

పాకలూ వున్నై; గుడిసెలూ వున్నై.

పడిపోయి మోకాలు ఎత్తులో వున్న పిట్ట గోడల్ని తప్పుకుని, ఇసుక పరచుకున్న రోడ్డు మీదుగా దేవాలయం ముందుకు చేరేం. అక్కడికొక వంద అడుగుల దూరంలో – కొండరాళ్లు పేర్చి వాటిమీద రెల్లు కప్పు వేసిన ఇంటిని చూపుతూ – 'అదే మా ఇల్లు' అని ఆగిపోయాడు శ్రీనివాస్. పక్కనేవున్న నాపరాళ్ల అరుగుమీద కూర్చున్నాడు.

చుట్టు ప్రక్కల ఇళ్లవాళ్లు మా రాకని గమనించారు. ఒక్కరొక్కరే మా దగ్గరగా చేరసాగేరు. వాళ్లు వేసే ప్రశ్నలకి 'ఆఁ' 'ఊఁ'లు సమాధానాలుగా చెప్తున్నాడు శ్రీనివాస్. ఈ వార్తని చెప్పటానికి ఒక రిద్దరు ఆచార్యులవారి ఇంటికేసి వెళ్లటం నేను గమనించాను. ఆ యింటి వైపు చూసేను.

ఆచార్యులవారు అరుగుమీద కూర్చుని కనిపిస్తున్నారు. అంగవస్త్రాన్ని మోకాళ్లకీ, నడుముకీ బిగించి; పర్యంక బంధం వేసుకుని ఎవరితోనో మాట్లాడుతున్నారు. ఆయన చేతిలో ఏదో పుస్తకం వుంది. అరుగుమీద ఆయన పక్కన మరో వ్యక్తి కూర్చునివున్నాడు. ఆయన్ని చూపి ఎవరన్నట్టు సైగ చేశాను శ్రీనివాస్ నుద్దేశించి. 'మా అన్నయ్య' అన్నాడు. అరుగుకు ఆనుకుని ఇంటి గుమ్మం ముందు ఆడవాళ్లూ, పిల్లలూ నిలబడి వున్నారు. అంతా మాకేసి చూస్తున్నారు.

'వెళ్దాం – రా' అన్నాను, శ్రీనివాస్‌తో అతను లేచి తడబడుతున్న అడుగులతో కదిలేడు. ఇంతలో ఎవరో మా ముందుకు వచ్చి చెప్పేరు.

'అక్కడికి రావాల్సిన పనిలేదని చెప్ప మన్నారు – అయ్యవారు.'

శ్రీనివాస్ నా కళ్లల్లోకి చూశాడు. నేను నా మట్టూ చూసుకున్నాను. అప్పటికే అక్కడ చాలామంది చేరేరు. 'ఫర్వాలేదు. నే చెప్తాను. రా' అంటూ ముందడుగు వేశాను. నాలుగు బారల దూరం నడిచేం.

ఆచార్యులవారు లేచి అరుగు దిగేరు. ఆయన కొడుకూ ఆయన్ని అనుసరించేడు. ఇంటి గుమ్మంలోకి వెళ్లారు. ఆడవాళ్లూ పిల్లలూ ఇంట్లోకి వెళ్లిపోయి నక్కి నక్కి చూడసాగేరు.

మేము మరో పది అడుగులు కదిలేము. ఆ యింటి తలుపులుటక్కున మూసుకున్నై. మా వెనగ్గా ఎవరో కిసుక్కున నవ్వేరు.

ఖాదర్ వాళ్ల ఇంటికి వెళ్లాం. అతను మాకు భోజనాలు ఏర్పాటు చేయడానికి బిడియపడటం గమనించి చెప్పేడు, శ్రీనివాస్ – 'చెడ్డ చేనుకు రెండు మంచెలు అనవసరం భాయ్' అని 'భోంచేసే పోతాం' అన్నాడు.

ఒకరిద్దరు గ్రామస్తులు అక్కడికి వచ్చేరు. ఏవో సానుభూతి వాక్యాలు చెప్పటం మొదలెట్టారు. శ్రీనివాస్ వాటిని పట్టించు కోకుండా ఖాదర్‌ని అతని గేయాలు వినిపించ మన్నాడు. ఖాదర్ తన పాటలు పాడసాగేడు.

అతను హాస్యప్రియుడు. తెలుగు సినిమా పాటలలో ఇంగ్లీష్ పదాలూ, హిందీ పదాలూ జోడించి అదే బాణీలో పాడటం అతనికి అలవాటుట. ఆ ధోరణిలో కొంతసేపు అతని 'కచేరీ' సాగింది.

భోజనాలు కాగానే తిరుగు ప్రయాణమైనాము.

చింతల తోపు చివరగా నిలబడిన ఆరేడేళ్ల పిల్లవాణ్ణి చూసి శ్రీనివాస్ నడక ఆగింది. వాడు పరిగెత్తుకుంటూ వచ్చి 'బాబాయ్' అంటూ శ్రీనివాస్ చేతుల్లో యిమిడిపోయాడు.

నా మనస్సు ఉద్విగ్నమైంది ముందు. క్షణాల తర్వాత అడిగేడు శ్రీనివాస్ వాణ్ణి, 'అమ్మా, నాన్నా, అత్తయ్యలూ అంతా బాగున్నార్రా' అని. వాడు తల ఊపేడు.

మాతో కొంచెం దూరం నడిచి బళ్ల బాట మలుపు తిరిగేచోట ఆగిపోయాడు వాడు. మేము ముందుకు సాగేము.

దారిలో అన్నాడు శ్రీనివాస్; ''మా యింట్లో మా ముత్తాతలనాటి భోషాణం, కావడిపెట్టె, కవిలెకట్ట, గంగాళం వున్నై రాజూ. మా నాన్న కాలంలో -- ఆ స్థిరాస్తికి మరికొంత చరాస్తి కలిసింది. అదంతా ఎటొచ్చీ నడిచే శవాల రూపంలో వుంది.''

పగిలిన గొంతులోంచీ దుమికిన అతని మాటలు నా మెదడు మొదళ్లని కదలించి వేసిన్నై !

* * *

శ్రీనివాస్ మరో కంపెనీలో ఉద్యోగంలో చేరేడు.

ఆ రోజున అన్నాడు : ''సిరిపురం నుంచీ వస్తుండగా నీకు చెప్పేను గుర్తుందా ? మా పెరట్లో పాడుబడిన బావి; మా వంటింట్లో

# దీపావళి కథ

దక్షిణంమీది మడిబట్టలు; తల వెనక్కు మెలిపించే మా నాన్న అర్భకత్వం; పులుసులో పడిన బొద్దింకల్లా మా యింట్లో ఆడవాళ్లు; ఆ యింటి జనానికే మూసుకుపోయిన లోవాకిళ్లు — వీటన్నిటిలా కాకుండా నేను ఆ యిల్లు ఖాళీ చేసేనని సంతోషించాను. కానీ, మా యింటివాళ్ల తమ ఉనికినీ, ఆచారాల్నీ అంటిపెట్టుకుపోయినట్టు -- ఈ ఉద్యోగ విషయంలో మాత్రం -- బల్లిలాంటి నాకు దీపం నీడని అంటుకు పోక తప్పడం లేదు.''

అతని పాటకి పల్లవీ, మాటకు రాగమూ మారలేదనుకున్నాను.

ఆర్నెల్లు గడిచినై —

'పెళ్లి సంబంధం చూశాను, పిల్లని చూసిపోక తప్ప'దని అన్నయ్య బలవంతం చేస్తే కాకినాడ వెళ్లి వచ్చాను.

వారం తర్వాత —

అన్నయ్య ఉత్తరం రాసేడు. ''మీ తమ్ముడిలో ఏ లోపమూ లేకపోతే కట్న కానుకలు ఎందుకు వద్దంటారు మీరు. మాకు మీ సంబంధం వద్దని రాశారు ఆడపిల్ల వాళ్లు' — ఇదీ సారాంశం !

ఇది విని, శ్రీనివాస్ పగలబడి నవ్వేడు. అతనెప్పుడూ అంతగా నవ్వడం నేనసలు చూడనేలేదు. ఆ తర్వాత అన్నాడు, ''దౌర్భాగ్యాలు రెండు రకాలు. ఒకటి— ఎవర్నీ నమ్మలేకపోవడం; రెండోది— అందర్నీ నమ్మడం. అసలు జీవితం — నటన, ఆత్మవంచన, కపట నాటకం కాదంటావా ? హృదయం ఏదో కావాలని తహతహలాడుతుంది, శరీరం దేన్నో పొందాలని వాంఛిస్తూ వుంటుంది. అది అందరనీ, దేన్నీ పొందలేమనీ తెలుసు. అయినా, ఏదో తపన. ఆ అగ్ని చల్లారదు, ఈ కాంక్ష చావదు. ఏమీ చెయ్యలేము; అస్థిమితత్వం — అలసత్వం; ఆరాటం — అసహాయత; వీటన్నిటినీ ఛేదించుకొని బయటకి రాలేక, ఆశలు — ఆశయాల పరిధిమీద ఒకే బిందువును పదేపదే పాదాలతో చుంబిస్తూ ఒకటే పరుగు. చివరికి భయంకరమైన యాతనా భారంతో మనిషి చీకటి కోణంలో కూరుకుపోతూనే వున్నాడు.''

శ్రీనివాస్ కేసి తేరిపార చూడలేకపోయాను — అతని మాటలు విన్న తర్వాత.

సూర్య శకలంలా మండిపోతున్నాడతను; ఇరుసున బెట్టిన కందెనలా కారిపోతున్నాడతను !

నెలరోజుల తర్వాత, ఒకరాత్రి —

నేను గదికి ఆలశ్యంగా చేరేను. అతను మంచంమీద పడుకుని కళ్లు మూసుకుని వున్నాడు. రెప్పల దిగువనా, కొలకుల్లోనూ — నీటి బిందువులు. ఆశ్చర్యపోయేను. ఏం జరిగిందని అడిగేను.

సన్నగా సమాధానం చెప్పేడు, ''మేరీ వస్తానని రాసింది. తిరిగి తనని స్వీకరించమని ... ఏదేదో రాసింది'' అని క్షణం ఆగి అన్నాడు మళ్లీ — ''నేను వేరే యిల్లు చూసుకోవాలి !''

ఉన్న దానికీ, అనుకున్నదానికీ మధ్యన శిలువ కెక్కిన శ్రీనివాస్ !—ఈ ''మనిషి''కి అర్థం ఏ నిఘంటువూ సమకూర్చలేదు !! ఈ 'భూమిక' స్వరూపం ఏ 'మనిషి' సంపూర్ణంగా చిత్రించలేదు !!!

పొడుపు కథకి సమాధానం వెతుక్కుంటున్న పసివాడిలా కళ్లు మూసుకుని, తల గిరుకోసాగేన్నేను !!!!






# సినిమా విశేషాలు -జి. వి. జి.



ఫొటో పంపినవారు : శ్రీ నగేష్

## మానవుడు – మహనీయుడులో మదించిన మనిషి

భుజంగం (నూతన్‌ప్రసాద్) నీలవేణి (హలం) ఆదమరచి నిద్రిస్తున్నారు. తలుపులోసుకొని ప్రవేశించాడు రంగ (శోభన్‌బాబు). ఆ చప్పుడుకు భుజంగం, నీలవేణి తృళ్ళిపడి లేచి కూర్చున్నారు.

రంగ సమీపించాడు. "ఏరా, భుజంగం! తేరగా వచ్చిన సొమ్ముతిని పందికొక్కులా బలిశావు... ఏమే, చిలకమ్మా! భుజంగాన్ని పట్టేంతర్వాత నానబెట్టిన బటానీలా ఉబ్బిపోతున్నావు? జాగ్రత్త! దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకో."

"మిస్టర్! ఇప్పటివరకూ జైలులో ఉండి వచ్చింది చాల్లేదా?" భుజంగం బుసలు కొట్టాడు.

"ఆ జైలు గోడల రుచే నీకు చూపిద్దామని—" అని రంగ అంటూండగా భుజంగం చివాలున పక్కనున్న ఓ సీసాను అందుకొని, దాని ఒక చివరను కత్తి మొనలా పగలగొట్టాడు. "ఎందుకు అనవసరంగా సీసా పగలగొట్టావు?" అంటూ రంగ ఒక్కటిచ్చుకోగానే భుజంగం ఎగిరి అవతల పడ్డాడు. చేతిలోని సీసా ముక్కలైపోయింది. "చూడు ... నేను ఉత్తరాభాద్ర నక్షత్రంలో పుట్టాను. నన్నెవడూ ఏమీ చేయలేడు," అన్నాడు భుజంగం.

అతనికి మరొకటి తగిలించి, "ఒరే,భుజంగం! 20 కిలోగ్రాముల ఎముకలు, 30 కిలోగ్రాముల మాంసం, 10 లీటర్ల రక్తం కలిస్తే మానవుడు అవడురా. వాటికి ఒక తులం మానవత్వం కలిస్తే మానవుడవుతాడురా. ఈ దేవాలయంలో దేవుడ్ని కూల్చేశావు. ముక్కూ మొహం తెలియని పసిబిడ్డలని అనాధలను చేశావు," అన్నాడు రంగ.

"నేను ... నేను అమాయకుడైన మానవుడ్ని. నాకేం తెలీదు. నేనేం చెయ్యలేదు."

"నువ్వేం చేశావో నీతోనే చెప్పిస్తానురా," అంటూ భుజంగం పీక పట్టుకున్నాడు రంగ.

"అయ్యో! ఊపిరాడ్డంలేదు. నన్ను చంపొద్దు."

భుజంగాన్ని వదిలేస్తూ, "ఆఫ్టరాల్ – ఊరకుక్కవు. నిన్ను చంపితే నాకేమి వస్తుందిరా? ఒరేయ్, ఈరోజు నుంచి నేను నీకు సింహస్వప్నాన్ని. నన్ను తలచుకుంటూ, అనుక్షణం భయపడుతూ సగం ఇక్కడే చస్తావ్. మిగతా సగం ఆ జైల్లో చస్తావ్! ఓ – కే?" అంటూ బయలుదేరాడు రంగ.

భుజంగం కళ్ళల్లోకి నీలవేణి బిక్కు బిక్కుమంటూ చూసింది.

పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో పి. జె. ప్రభాకరరెడ్డి, కైలాష్ చంద్ర అగర్వాల్ నిర్మించిన ఉషశ్రీ మూవీస్ "మానవుడు–మహనీయుడు"లో సుజాత, రీనా, హలం, జయమాలిని, జయప్రకాష్, రాళ్ళపల్లి, అర్జా జనార్దనరావు, పొట్టి ప్రసాద్, ఏచూరి, భీమరాజు, మోదుకూరి సత్యం, జగ్గారావు, రాఘవయ్య, కాశీనాథ్ తాతా, కోడలి ఉమామహేశ్వరరావు, జయవిజయ, లక్ష్మికళ, ఝాన్సి, జయవాణి, బేబిరాణి, జేబీసరస్వతి నటించారు. ఉషశ్రీ కథ, స్క్రీన్‌ప్లేకు పరుచూరి సంభాషణలకర్త. సి. నారాయణరెడ్డి, మోదుకూరి జాన్సన్, ఉషశ్రీ, పరుచూరి గోపాలకృష్ణ గీతాలకు చక్రవర్తి సంగీతమిచ్చారు. జె. సత్యనారాయణ ఛాయ, తార నృత్యాలు, సాయికుమార్ శిల్పం, అంకిరెడ్డి కూర్పు, నన్నె రాధాకృష్ణ సహకార దర్శకత్వం, దాసరి పార్థసారధి నిర్వహణతో సి. సత్యన్నారాయణ, సుధీర్‌కుమార్ అగర్వాల్ సహ నిర్మాతలు.

## పేకేటి శివరాం రూపొందించే చిత్రాలు

ఇంతవరకు 13 కన్నడం, 2 తమిళం, 3 తెలుగు చిత్రాలకు దర్శకత్వం వహించిన నటుడు, ప్రతికాకర్త పేకేటి శివరాం "మాలలు మాత్రం మనుషులుకారా?" అనే విజయప్రభా ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి చిత్రాన్ని నవంబర్ 24న మొదలెడ్తారు. ఇందులో నాయికగా కేంద్ర ప్రభుత్వంలో పనిచేస్తున్న యువతి నటిస్తుంది. తతిమ్మా పాత్రలకు హైద్రాబాద్‌లోని వర్ధమాన రంగస్థల కళాకారులను ఎన్నుకుంటారు. సాయిబాబా సహనిర్మాత, క్వాజా అహ్మద్ అబ్బాస్ దర్శకత్వ పర్యవేక్షకుడు. డిసెంబర్ నుంచి జయప్రభా ప్రొడక్షన్స్ పతాకంలో "పిచ్చిమాలక్ష్మి పెళ్ళి" అనే చిత్రాన్ని తీస్తారు. మంగళగౌరి ఇందులో నాయిక. శివాని రాసిన కథకు పరుచూరి సంభాషణలకర్త. ఎస్. రాజేశ్వరరావు సంగీతం, సుమతీ కౌశల్ నృత్యాలు ఇతర హంగులు. జగ్గయ్య వ్యాఖ్యానంతో వరకట్న నిషేధంపై ఒక డాకుమెంటరీ చిత్రాన్ని కేంద్రప్రభుత్వానికి అక్టోబర్ నెలాఖరులోగా పూర్తిచేసి ఇవ్వబోతున్నారు. దీనికి శివాని కథ, మాటలు రాశారు. "విషువల్ ఎద్యుకేషన్ డాకుమెంటరీస్ – పేరుతో నవంబర్‌లోగా ఒక ఔట్‌డోర్ యూనిట్‌ను 11 లక్షల వ్యయంతో ఏర్పాటు చేయబోతున్నాను. దీనికి స్టేట్ ఫైనాన్స్ కార్పొరేషన్ నుంచి 9 లక్షల ధన సహాయం అందుతోంది. ఇకపోతే, బాలల అకాడమీకి నేను తీసిన 90 నిమిషాల డాకుమెంటరీని త్వరలో రిలీజ్ చేయడానికి ప్రభుత్వం ఏర్పాట్లు చేస్తోంది... వచ్చే ఏప్రిల్ నుంచి లక్ష్మి హీరోయిన్‌గా బెంగళూరులో ఒక కన్నడచిత్రాన్ని డైరెక్ట్ చేయబోతున్నాను," అంటూ వివరించారు పేకేటి శివరాం.

క్రింది చిత్రం : 'మొగుడు కావాలి'లో చిరంజీవి



## అమృత కలశంలో పాషాణ హృదయం!

"ఉండేందుకు మేడ. తిరిగేందుకు కారు. ఐశ్వర్యానికి ఐశ్వర్యం..." పానకాలు ఏకరువు పెట్టేస్తున్నాడు.

తులసి చేతులు జోడించింది. "మావయ్యా, నీకు దణ్ణం పెడతాను. నన్నా మురికి కూపంలోకి తొయ్యొద్దు. మనసుకి నచ్చినవాడ్ని మనువాడదామనుకుంటున్నాను, మావయ్యా! నాక్కావలసింది మంగళసూత్రం."

పానకాలు విరగబడి నవ్వాడు. "మంగళసూత్రాలమీద మోజుగా ఉంటే, రోజుకొకటి కట్టించుకో, పాపా! ఒకడు కట్టిన ఒకే ఒక మంగళసూత్రానికి గేరంటీ తక్కువ. వాడు కన్ను మూస్తే, దాన్ని తెంపేసి మూలకూచోవాలి. పదికాలాలపాటు పచ్చగా నిత్యసుమంగళిగా మిగిలిపోవాలంటే —"

తులసి ఇక వినలేకపోయింది. రెండు చెవులూ మూసుకొని, "నా కిష్టంలేదు!" అని అరిచింది.

"నిన్నింతకాలం ఏపుగా పెంచింది విడిచిపెట్టడానికి కాదు," అంటూ పానకాలు (రాళ్ళపల్లి), తులసి (మంజుభార్గవి)ని, గదిలోకి తోసి తలుపు మూసేశాడు.

గిడుతూరి సూర్యం స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బి. పి. రాయ్ నిర్మించే బిందూ మూవీస్ "అమృత కలశం" చిత్రానికి ఆదివిష్ణు సంభాషణలకర్త. రమేష్‌నాయుడు సంగీత దర్శకుడు.



## ఊటీలో ఆశాజ్యోతి

"అక్టోబర్ 1 నుంచి 7 వరకు ఊటీలో వివిధ లొకేషన్స్‌లో మూడు పాటలను మురళీమోహన్, సుజాతల మీద పిక్చరైజ్ చేశాం. రెండు పాటలు వేటూరివి, ఒక పాట సి. నారాయణరెడ్డిది. దీంతో షూటింగ్ ముగిసింది. ఇక డబ్బింగ్, రీ రికార్డింగ్ పూర్తిచేసుకొని త్వరలో విడుదల చేస్తాం," అన్నారు దర్శక నిర్మాత తాతినేని ప్రకాశరావు. టి. ఎల్. వి. ప్రసాద్ సమర్పించే జవిల్ ప్రొడక్షన్స్ "ఆశాజ్యోతి" చిత్రానికి జంధ్యాల, రమేష్‌నాయుడు, విన్సెంట్, తోట, కణ్ణన్, యు. ఎస్. వి. పాణి, బి. కృష్ణమూర్తి తెరవెనుక కృషి చేశారు.

'అమృత కలశం'లో మంజుభార్గవి

'పులిబిడ్డ'లో కృష్ణంరాజు, శ్రీదేవి

# వింతలు-విచిత్రాలు!

★ శ్రీలంక రేడియో నిలయం నుంచి ప్రతి శనివారం రాత్రి ఎనిమిది గంటలకు మన సంగీత దర్శకుల సినిమా పాటలు ప్రసారం చేశాక — వాటిలో ప్రతి పాటా ఏ విదేశీయ ట్యూన్ నుంచి కాపీ కొట్టబడ్డాయో — సోదాహరణంగా ఆ ఫారన్ సాంగ్‌ను కూడా తర్వాత వినిపిస్తున్నారు.

★ నాగపూర్‌లోని ఓ పారిశ్రామికవేత్త స్థానిక థియేటర్ యాజమాన్యంమీద దావా వేశాడు. ఆ థియేటర్‌లో ఆయన సినిమా చూస్తూంటే, ఓ నల్లి కుట్టిందట. ఆ కుట్టిన మేరకు సెప్టిక్ అయిపోయేసరికి ఆయన వెంటనే ఒక డాక్టర్ దగ్గరికెళ్లి సర్టిఫికేట్ తీసుకొని, కేసుపెట్టాడుట.

★ సాధారణంగా ప్రతి సినిమా చివరన "శుభం" అనో, "ది యెండ్" అనో వేయడం కదా మామూలు? కాని, డైరెక్టర్ మృణాళ్ సేన్ "మృగయా" చిత్రం చివరన "లేచి నిలుచోండి" అని వేయించడం కొందరికి బాధ కలిగించింది.

★ అమెరికా నుంచి ఒకతను తన అభిమాన



గాయని లతా మంగేష్కర్‌కు వో ఉత్తరం రాసి, కవర్‌మీద 'లత ... సింగర్ ... ఇండియా' అని అడ్రసు రాసి పోస్ట్ చేశాడు. పోస్టల్‌శాఖ వారి ధర్మమా అని—అది 'సింగర్' కుట్టుమిషన్ కార్యాలయానికి చేరింది. 'సింగర్' అని రాయకుండా 'లతా మంగేష్కర్ ... ఇండియా' అని రాసి ఉంటే, కరెక్ట్‌గా ఆమెకే చేరి ఉండేదేమో!

★ కలకత్తా డాలీగంజ్‌లోని వో థియేటర్‌లో అప్పుడప్పుడు ఒక వింత 'స్లైడ్' చూపిస్తూంటారు. ఆ థియేటర్ కాస్త పల్లంలో ఉంది. వర్షం కురిస్తే బయటనీళ్ళు లోపలికి వచ్చేస్తాయి. అందుచేత, అలాటి సమయాలలో "వర్షం నీళ్ళు లోపలికి వస్తాయేమో! మీ పాదాలు తడవకుండా జాగ్రత్త పడుతూ, సినిమా చూసి ఆనందించండి" అనే స్లైడ్ చూపిస్తూంటారు.

★ మనదేశంలో 14 భాషల్లో దాదాపు వెయ్యి సినిమా పత్రికలు వెలువడుతున్నాయి!

★ యూస్సీలోని ఒక 65 ఏళ్ళ పోస్టల్ ఉద్యోగి "హేమ శతకం" అంటూ హేమమాలిని మీద వంద పద్యాలు రాశాడు. హేమ పట్ల అతనికి ఎంత పిచ్చి అంటే — అతను రిటైర్ అయ్యే సమయంలో సహోద్యోగులు హేమమాలిని ఫోటోకు ఖరీదైన ఫ్రేమ్ వేసి అతనికి బహూకరిస్తే, "ఆహా! ఇంతకన్నా విలువైన కానుక ఏముంది?" అంటూ తెగ మురిసిపోయాడట.

★ "ఆస్ పాస్"లో ధర్మేంద్ర — హేమమాలిని, "రాణి" అనే తమిళ చిత్రంలో ప్రతాప్ — నిత్యల చుంబన దృశ్యాలున్నాయట.

★ ధర్మేంద్రను పెళ్ళి చేసుకున్నప్పట్నుంచీ హేమమాలిని చీరలకు బదులు ఎక్కువగా సల్వార్ — కమీజులలోనే కనిపిస్తోందట. ధర్మేంద్ర మాత్రం అప్పుడప్పుడు గూడకట్టు పంచతో దక్షిణాదివాడిలా కనిపించడానికి తాపత్రయ పడుతున్నాడట ... పెళ్ళయినప్పట్నుంచీ హేమమాలిని భరతనాట్యం ప్రోగ్రామ్‌లు ఇవ్వడం మానేసింది ... ధర్మేంద్ర ఆ మధ్య ఒక హిందీ చిత్రం షూటింగ్‌కు నేపాల్ వెళ్ళినప్పుడు కైపులో ఉన్నాడేమో — ఒక నేపాలీ యువకునిమీద చెయ్యి చేసుకున్నాడు. దాంతో నేపాలీయులకు ఆగ్రహం కలిగి, ధర్మేంద్ర చిత్రాలు నేపాల్‌లో ఎక్కడా ప్రదర్శింపకూడదని తీర్మానించారట. [జి.ఎ.జి.]

'రహస్య గూఢచారి'లో ఒక దృశ్యం



విశ్వవిఖ్యాత నటసార్వభౌమ

డా॥ యన్.టి.రామారావు నటించిన

శ్రీ అన్నపూర్ణ ఇంటర్‌నేషనల్

దాసరినారాయణరావు

# సర్దార్ పాపారాయుడు

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత: క్రాంతికుమార్

సంగీతం: చక్రవర్తి

కెమెరా: ఎస్.వెంకటరత్నం




THARAKAPRABHU ADS.

## సామాన్యుని సణుగుడు

జన 'రణ గొణ' మన
దేశంలో ... నూటికి
యెనభై మందో
యెనభై ఒక్కమందో
పల్లెటూళ్లల్లో ఉంటూ
అదేపనిగా చెమట
వోడ్చి వోడ్చి మరీ వోడ్చి
ఏడాదంతా ఒకటో
మూడో నాలుగో పంటలు
తెగ పండిస్తూంటారు!

ఈ దేశానికి వెన్నుముక
రైతు రైతే రైతేనంటూ
వాగుతూంది ఆకాశవాణి!
కాని దౌర్భాగ్య దేశంలో
వో పూట తిండికన్నా
ఇద్దరాడకూతుళ్ల
'మాన హరణం' వెల చౌక!

ఏజెన్సీలు ఏజెంట్‌లు
అడవులు ఆటవికులు
అన్నీ మెజారిటీలో
విస్తరిస్తున్నా; విస్తట్లో
మిరియం మిరపకాయ
చింతపండూ — చక్కెర
వీటిని వానన కోసం కన్నా
ఎక్కువేసుకునే
శాల్తీ నల్లధనానికి
రంకు మొగుడై తీరాలి!

ఈ లంబా ద్వీప
కల్పం చుట్టూరా మూడు
వైపులా మహాసంద్రాలు
మ్రోరో మ్రోరోమని
ఘోషెడుతూ వుంటాయి
అంగట్లో ఉప్పగల్లు
రూపాయికి మూడు శేర్లు
అదీ కల్తీ లేకండా దొరికిందా?
శ్రీరామచంద్రుణ్ని
చంపుకుతిన్నంత వొట్టు!

తెనుగు సినిమాల్లాగ
పండగలొస్తాయి
వారానికి రెండో మూడో ..
కాని పండగనాడొచ్చిన
అల్లుడికి నెయ్యా లేదు
[illegible]
[illegible] మూవే లేదు

కందిపప్పు [illegible]
పప్పు [illegible]
పప్పు పిడతకింద
పప్పు — అసలు ఏ పప్పు
వూసెత్తడమైనా తప్పు తప్పు!

కాఫీ టిఫినూ
కలిపి రూపాయికొస్తే
స్వామ్యవాదం అమ్మ
కడుపు కాలినంత ఒట్టు!

దసరా మామూళ్ల కోసం
చేసిన చేబదుళ్లు
గుండెల్లో చేస్తున్నాయి
కల్తీ లేని టపాకాయ
[illegible]గ తెగ చప్పుళ్లు!

మేకలున్నాయి గొర్రె
లున్నాయి ఆవులూ
గేదెలూ కూడా జాస్తే
జనాల్లో ? బోలెడున్నారు కాని
[illegible] నెయ్యా కూడా
[illegible]
[illegible]
[illegible]

[illegible]
[illegible]
[illegible] దీపాలెందుకు?
[illegible]
[illegible] మురం .. కొడుకులా
అత్తరు దీపాలెట్టుకొని

కులుకుతూవుంటే
'సత్యభామ'లు 'రేప్'
కాకండా రేపటి
ఉదయం వస్తుందా?
అని హడిలి ఛస్తూంటే
బాంబు లెందుకు?
ఆటమ్‌బాంబు లెందుకు?
తారాజువ్వలెందుకు
చిచ్చుబుడ్లెందుకు?
దీపావళి ఎందుకు
దీపాలెందుకు?
తగలెయ్యనా?

జాతి మత కుల
తన పం భేదాలొద్దని
* ''గాంధీ''గారు చెప్పలేదా?
మనకందరికీ
ఒకటే పండుగ —
''అదేటంటారా?''
''అదేనండి ఎలక్షన్ల
పండగ'' — అది
ఐదేళ్లకోసారే వస్తుంది!
ఐదేళ్లదాకా దీపాలార్పేస్తుంది!
ఇక ఫో! —
దీపా లెవడెట్టగలడీ దేశంలో?

— వీ రా జీ

* శ్రీమతి గాంధీ

## ఇంద్రుని యుక్తి

ఉపాయశాలులైన ప్రతిభావంతులు తమ పని నెరవేరడానికి వాగ్దానం చేసినా, ఎదుటివారి చేత స్వయంగానే ఆ వాగ్దానాన్ని — ధర్మహాని లేకుండా రద్దు చేయించగలరు. అలాంటి వారిలో ఇంద్రుడు మొదట చెప్పదగినవాడు.

దేవతలకూ, దానవులకూ చాలా యుద్ధాలు జరిగాయి. ఒక్కొక్క యుద్ధానికీ ఏదో కారణం వుంటూనే వుండేది.

ప్రహ్లాదుడు రాక్షసులకు రాజుగా ఉన్నప్పుడు— రాక్షసులందరికీ అతణ్ణి ఇంద్రుడుగా చెయ్యాలనీ, స్వర్గాన్ని ఆక్రమించుకోవాలనీ సంకల్పం కలిగింది. అందువల్ల వారు దేవతల మీదికి యుద్ధానికి బయలుదేరారు.

యుద్ధం ప్రారంభించడానికి ముందే జయాపజయాలు ఎలా వుండగలవో తెలుసుకోవాలని రెండు పక్షాల వారికీ కుతూహలం కలిగింది. అందువల్ల వారు ప్రత్యేక ప్రత్యేకంగా త్రికాలజ్ఞుడగు బ్రహ్మదేవుని వద్దకు వెళ్లి జరగబోయే యుద్ధంలో ఎవరు జయిస్తారో తెలుపాలని ప్రార్థించారు. మహావీరుడైన రజి ఎవరి పక్షాన వుండి యుద్ధం చేస్తాడో ఆ పక్షమే గెలుస్తుందని బ్రహ్మ స్పష్టంగా చెప్పివేశాడు.

తర్వాత దానవులు రజి వద్దకు వచ్చి తమకు యుద్ధంలో సహాయ పడవలెనని ప్రార్థించారు. ''మీరు జయించిన తర్వాత నన్ను ఇంద్రుడుగా చెయ్యడానికి సమ్మతించినట్లయితే నేను మీకు సహాయపడతా''నని రజి చెప్పాడు. దానవులు ''మీరు మరేది కోరినా మేము దాన్ని నెరవేరుస్తాము. కాని ఇంద్ర పదవి మాత్రం యివ్వలేము. మా ప్రభువు ప్రహ్లాదుడు ఇంద్రుడు కావాలని మా కోరిక. మేమీ యుద్ధంలో దిగడం కూడా అందుకోసమే!'' అని చెప్పి, యిక లాభం లేదని వెళ్లిపోయారు

తర్వాత దేవతలు వచ్చి దానవులు ప్రార్థించినట్లే తమకు యుద్ధంలో సహాయం చెయ్యాలని రజిని ప్రార్థించారు. అతడు దేవతలతో ''మీరు గెలిస్తే... మీ ఇంద్రుణ్ణి పదవినుంచి తప్పించి, ఆ పదవిని నాకిస్తారా? అలా యిస్తేనే మీకు సాయం చేస్తాను'' అన్నాడు. దేవతలు ఇంద్రుడి మొగం చూచి, అతని అభిప్రాయాన్ని గ్రహించి ''సరే! అలాగే యిస్తాము'' అని వాగ్దానం చేశారు.

తర్వాతదేవాసురులకుపెద్దయుద్ధంజరిగింది. బ్రహ్మ చెప్పినట్లే జరిగింది. రజి దేవతల పక్షాన వుండి యుద్ధం చేసినందువల్ల వారే గెలిచారు. అసురులు ఓడిపోయారు. ఇక రజికి ఇంద్ర పదవి రావలసి ఉన్నది. అప్పుడు ఇంద్రుడు రజి రెండు కాళ్లూ పట్టుకొని ''నీవు చేసిన సహాయం ఎంతో గొప్పది. రాక్షసుల భయంనుండి రక్షించావు. మా రాజ్యం నిలిపి మాకు తిండిపెట్టావు. నీవు మాకు తండ్రివంటివాడవు. నేను నీకు పుత్రుడను. నన్ను కాపాడవలసిన భారం నీది'' అన్నాడు.

రజి ఇంద్రుడి అభిప్రాయాన్ని గ్రహించాడు. అతని ప్రియ వాక్యాలకు పొంగిపోయాడు ఇంద్రుడు తనకు కొడుకు నంటున్నాడు కదా! తండ్రి స్వార్థం కోసం కొడుకును పదభ్రష్టుణ్ణి చెయ్యగలడా! అప్పుడు రజి ఇంద్రుడితో ''నీ మాటలు మనస్సుకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తున్నవి. శత్రు పక్షంవాడు వచ్చి యిలా మాట్లాడినా అతనికి అపకారం చెయ్యలేను. ఇక స్వపక్షంవాడు ఇలా అంటున్నప్పుడు వానికి ఎలా కష్టం కల్గించగలను? ఇకమీదకూడా నీవే ఇంద్రుడివిగా ఉండు'' అని చెప్పి తన నగరానికి వెళ్లిపోయాడు. ఇంద్రుడు నిరాఘాటంగా తన పదవిని కొనసాగించాడు

మనస్సును ఆకట్టే మాటలవల్ల శత్రువును కూడా లొంగదీయవచ్చును. ఇక మిత్రపక్షంవారు యిలా మధురంగా మాట్లాడి తమ సంకల్పం నెరవేర్చుకోవడంలో కష్టం ఎందుకు ఉంటుంది?

— బులుసు వేంకట రమణయ్య

— ధర్మ పథం —

# మీ చర్మ యవ్వన సౌందర్య రహస్యం, ఇప్పుడు మీ చేతిలోనే వుంది.
# హిమానీ గ్లిసరిన్ సబ్బు నిర్మలంగా శుద్ధమైనదిగా వుందంటే
# 60 సంవత్సరముల అనువాయతీగా వస్తున్న స్థిరమైనవస్థాయి.

పరిశుద్ధమైన గ్లిపరిన్ సబ్బు ఇదే మీ చర్మాన్ని యవ్వనంగా
ఉంచుతుంది, చర్మం ఆరకుండాను, ముడతలు పడకుండా సదా ఉంచుతూ
చమ్మను కాపాడుతుంది. ఇంత పరిశుద్ధమైనది మరి ఏ యితర
గ్లిసరిన్ సబ్బు దీనిలా లేదు—మృదువైన హిమానీ



ఎక్కువ మురుగుతో హిమానీ మీ ప్రతి అంగాలలో మన్న మురికిని నిర్మూలించగలదు.

**మీ చర్మాన్ని ఏ విధంగా వుంచాలో అటువంటిదే హిమానీ ఒక స్వచ్ఛమైన పారదర్శకమైన సబ్బు.**

ఇప్పుడు మీ పట్టణానికి కూడా వచ్చింది.

గ్యారంటీ

60 సంవత్సరముల నుండి హిమానీ గ్లిసరిన్ సబ్బు ప్రకృతి శుద్ధమైన నూనెలతో తయారు చేయబడుతుంది ధరలు బాగా హెచ్చింప

B/I TEL

# 4




(గత సంచిక తరువాయి)

నాన్నకీ, అమ్మకీ వాదోపవాదాలయ్యే రోజులు ఎలా లేదన్నా నెలకి నాలుగయిదుండేవి. ఆ తగువులు ఎలా ప్రారంభం అయ్యేవో చంపకి అంతుపట్టేది కాదు.

ఈ తగవు రాత్రి ఏడు తరవాతనన్నా ప్రారంభం అయ్యేది, లేదా ఉదయం కాఫీతోనన్నా ప్రారంభం అయ్యేది. ఒక అంశంమీద ప్రారంభమయిన తగువు ఎన్నో సంగతులలోకి వెళ్లిపోయేది. ఎన్నెన్నో విషయాల సింహావలోకనం జరిగేది. అమ్మ ఏడుస్తూ మాట్లాడితే, నాన్న కోపంగా మాట్లాడేవారు.

చంపా, శ్రీనూ, రామం ఇంట్లో ఉంటే కిక్కురు మనకుండా వినేవారు.

నాన్న కేకలు ఇలా ఉండేవి: "ఈ వెధవ సంసారం నేనింక చెయ్యలేను. అవధానిలా ఆ అడవుల్లోకి పోతాను సన్యసించి! ఎంత డబ్బు తెచ్చినా చాలదు! ఎక్కడ చూసినా అప్పులు! అప్పులు! అటు చూద్దునా, ఆఫీసులో బండ చాకిరీ తప్ప, దమ్మిడీ జీతం ఎక్కువవటం కాని, పైరాబడి దమ్మిడీ అన్నా వచ్చే మార్గం కాని లేదు! ఇంటి కొస్తే నీ గోల! అదిలేదు ... ఇదిలేదు ... బియ్యం అయిపోయింది ... కాఫీ గుండ అయిపోయింది అంటూ! నేనేం మహారాజునా? పెరట్లో చెట్టు దులుపుతే డబ్బు రాల్తుందా?"

ఆ మాటలకి అమ్మ జవాబు: "ఈ పూటకి ఆ పూట పచ్చడి మెతుకులు తింటున్నాం. దీనికే ఇలా అయిపోతున్నారు! ఇంకా పంచభక్ష్యపరమాన్నాలతో భోంచేస్తే ఇంకెంతందురో! అందరూ మీలాగే సంసారం వదిలేసి సన్యసించేస్తాం అంటున్నారా? ఆ సన్యాసమ్మగారిని చూడండి? మనకన్నా వాళ్లేమన్నా ఎక్కువ తెచ్చేసుకుంటున్నారా? నలుగురు పిల్లలాయె! ఎప్పుడూ కళకళలాడుతూ ఉంటారు. నెలకో చీర కొనిపెడతాడు మొగుడు! మొన్నటికి మొన్న పలకల మురుగులు చేయించుకుంది. వచ్చేనెల పండక్కి జిగినీ వాను చేయించుకుంటుందిట! నేనూ ఉన్నాను ... ఎందుకు? ఉన్నది కాస్తా ఊడ్చుబాటు చేసి అమ్మేసారు! మిగిలిన ఈ రెండుజతల గాజులమీదా, గొలుసుమీదా మీ కళ్లు పడ్డాయి! చేయించడం పోయి ఉన్నది కాస్తా అమ్మేస్తాం అంటున్నారు! మీరు ఆడింది ఆట, పాడింది పాట అంటే నేను మంచిదాన్ని, లేకపోతే నేను చెడ్డదాన్ని!" అంటూ, ఇంటి పనులు చేస్తూనే అమ్మ ఏడుస్తూ కేకలు.

"ఆ సన్యాసమ్మ సంగతే చెప్పేవ్? వాళ్లలా నాకూ కోనసీమలో కొబ్బరితోటా, మామిడితోటా ఉంటే, నేనూ ఒక వెలుగు వెలిగించి ఉందును. పలకల మురుగులేం ఖర్మ? నీకు గజ్జెల వడ్డాణం, మెడలోకి చంద్రకాంతాలూ చేయింతును! నెలనెల సిల్కు చీరలే కొని ఉందును! కడిగేసిన జీతం రాళ్లు తప్ప నెలనెలా మనకేమన్నా ఇతర ఆస్కారం ఉందా? ఈ రామిగాడు మెట్రిక్కి వచ్చేడు. వీడు పాసయ్యేక కాలేజీలో చేర్పించాలి కదా? బి. ఏ. పాసయినా ఉద్యోగం దొరికేగతి లేకపోతోంది ఇవాళా రేపూ! ఇంక శ్రీనుగాడు వచ్చేఏటికి మెట్రిక్ పాసవుతాడు. వాడినీ కాలేజీలో చేర్చాలి కదా? ఈ చంపగుంట గబగబా ఎదిగిపోతోంది. మరో రెండేళ్లకల్లా పెద్దమనిషయి నా పీకలమీద కూర్చుంటుంది, మొగుణ్ణి తే అంటూ! వెంటనే కాకపోయినా, దానికి పద్దెనిమిదేళ్లు నిండేలోపున పెళ్లి చెయ్యాలంటావా? పదివేలు పట్టుకొందే పెళ్లవుతుందా? ఎక్కడ్నించితేవటం పదివేలు? పిల్లకి చదువులే చెప్పిస్తానా? దానికి పెళ్లే చేస్తానా?" అంటూ నాన్న!

తన పెళ్లి సంగతి అంత బాహాటంగా చర్చలోకి వచ్చేసరికి చంప ఎంతో సిగ్గుపడిపోయేది. ఇంట్లో ఏ మూలో నక్కిపోయి, చెవులు రిక్కించుకు వినేది.

దగ్గర్లో రామంకాని, శ్రీనుకాని ఉంటే, "ఒసేవ్! నాన్న నీ పెళ్లి చేస్తాట్ట! ఇవాళ!" అంటూ ఏడ్చేవా చేసేవారు. అంటే వాళ్ల ఉద్దేశం వీపుమీద దరువుల పెళ్లని!

"నీకూ అదే పనౌతుంది లేరా! పరీక్షలో మార్కులు సరిగా తెచ్చుకోపో ...! సీటు కాలేజీలో రాకపోనీ, తెలుస్తుంది అబ్బాయిగారి సంగతి!" అంటూ చంప రిటార్ట్ ఇచ్చేసరికి రామం తగ్గుతాడు.

అమ్మ మాత్రం ఊరుకోదు! "అందరికీ ఎప్పుడో చావు రాసిపెట్టి ఉందని చెప్పి ఇవాళే చచ్చిపోతున్నారా? పిల్లల్ని కన్నాక చదువులూ చెప్పించాలి, పెళ్లిళ్లూ చెయ్యాలి! తప్పుతుందా? నాకో నేతచీర కొనాలనేసరికి మీకు కొడుకుల కాలేజీ చదువుల సంగతి కూతురుపెళ్లి సంగతీ గుర్తుకొస్తుంది! సన్యసించేస్తాను, అడవుల్లోకి పోతాను అంటారు. అంతగా వెళ్లిపోవాలని ఉంటే వెళ్లిపొండి! మీ బుచ్చి ఎలా బతుకుతోందో, నేనూ అలానే బతుకుతాను! అవిడికి మొగుడు నెలనెలా డబ్బు పంపుతున్నాడు ... కూచొని తింటున్నది. ఒక్కడే కొడుకు! నేను మరి ఏం చేస్తాను? ఆ ఇంటా, ఆ ఇంటా వంటలు చేసో, పిండ్లు రుబ్బో, పాచిపని చేసో, నా పిల్లల్ని పోషించుకుంటాను!"

ఇలా నడుస్తుంది మాటల యుద్ధం. ఓ గంట సేపు ఇద్దరూ ఒకరిమీద ఒకరు అరిచి అరిచి, ఉరుములూ మెరుపులతో పెద్దవర్షం పడి వెలిసినట్టు తగ్గి ఊరుకుంటారు. యుద్ధం ఉదయం ఆరంభమయితే, "వంటయింది, భోజనానికి లేవండి!" అన్న పిలుపుతో నాన్న భోజనానికి లేస్తారు.

అదే రాత్రయితే, అమ్మ పెరట్లో మంచం వేసుకు పడుకుంటుంది, వంట వండేసి అలిగి, ఎంతకీ వడ్డించకపోగా, నాన్న వెళ్లి, "లే! లేచి అన్నంపెట్టు!" అంటారు.

"నా కింక ఈ ఇంట చాకిరీ చేసే ఓపికలేదు! నేనీ ఇంట్లో మీకో పనిమనిషిగానూ, బానిసగానూ కనిపిస్తున్నానే తప్ప, మనిషిగా కనిపించటంలేదు! వేళకి మూతి దగ్గరకి బువ్వ వచ్చేస్తూ ఉంటే, సమయానికి అన్ని సదుపాయాలూ జరిగిపోతుంటే, నేను ఎలా బతికినా చచ్చినా, మీకూ, మీ పిల్లలకీ పట్టదు!" అంటుంది ఏడుస్తూ!

నాన్న బతిమిలాడుతారు "లే! లే! మూర్ఖత్వం పనికిరాదు!"

"మీరు వడ్డించుకు తినండి! నా కాకలిలేదు! మీ తిట్లతో కడుపు నిండిపోయింది!"

"అద్గో! అదేవద్దు! బతిమాల్తూ ఉంటే మరింత కొండెక్కి కూర్చుంటావ్!"

"ఎందుకు బతిమాల్డం? ఎవరు బతిమాలమన్నారు?"

ఇలా కొంతసేపు జరిగేక, నాన్న తన మనసు మారిందని సూచించేక అమ్మలేస్తుంది. పెరట్లోంచి కేక — "చంపా! కంచాలు పెట్టి, పీటలు వెయ్యి!" అని.

"కంచాలు పెట్టేసానమ్మా!" అంటూ చంప జవాబు! హమ్మయ్య! పెద్ద గాలివాన వెలిసిందిరా బాబూ! అనుకుంటూ.

ఇంతవరకూ పుస్తకం ముందేసుకొని, పైకి చదువుతూ, చదివింది అర్థమయిపోయినట్టు అభినయిస్తున్న రామం, శ్రీనూ వెంటనే పుస్తకాలు మూసేసి, లేచిపోయి, కాళ్లు కడిగేసుకుని, కంచాల ముందుకొచ్చి కూర్చుంటారు, ఆ బట్టలతోనే. నాన్నమ్మ ఉంటేనే మడిబట్టలు. పాత్తుబట్టతో లాగులున్నాయి వాళ్లకి ... వంటింటి చిలక్కొయ్యకి వ్రేలాడుతూ.

మాటా మంతీ లేకుండా భోజనం అయిపోతుంది.

అమ్మ అన్నం తినకుండా, మళ్లా పెరట్లో పడుకోగ, "నాన్నా! అమ్మ అన్నం తినలేదు!" అంటూ చంప నాన్నకి చెప్తుంది.

నాన్న సిగరెట్టు ముట్టించి, మళ్లా పెరట్లోకి వచ్చి, అమ్మని జబ్బపట్టుకొని లేవదీస్తారు. అమ్మ వెంటనే ఎంతో సిగ్గుపడిపోయి, "ఏమిటే వేళాకోళం పిల్లల ముందు?" అంటూ లేస్తుంది.

"లేచి భోంచేస్తావా, చెయ్యనా? పద! నేను వడ్డిస్తాను!" అంటారు ఆదోలా నవ్వుతూ.

"బాగుంది వరస! మొగుడుచేత చాకిరీ

**జరిగినకథ: 1** చంప నాన్న కాశీపతి చాలీ చాలని జీతంతో ఆ ఇంటిని అలానే నెట్టుకొస్తున్నాడు. మధ్య తరగతి కుటుంబంలో ఉండే చికాకులు, సమస్యలు ఆ ఇంట్లోనూ వున్నాయి. చంప నాన్నమ్మకి వోపిక ఉన్నంత కాలమూ చాకిరీ చేయించుకొన్న కొడుకులూ, కూతుళ్ళూ ఆమెకు వోపిక తగ్గడంతో ఆమెను పోషించటానికి వంతులు పడ్డారు. చంప మామ అవధానివల్ల నాన్నకి ఏర్పడ్డ చిలుము గొట్టం అలవాటుతో అమ్మా, నాన్నల మధ్య వాదోపవాదాలు చెలరేగేవి.

దాసరి నారాయణరావు

శ్రీలలితా ఎంటర్‌ప్రైజెస్





# స్వప్న

ఈస్ట్‌మన్‌కలర్

నిర్మాత: జి. జగదీష్‌చంద్రప్రసాద్ B.A.,

సంగీతం: సత్యం కెమెరా: కె.యస్.మణి

అన్నపూర్ణ ఫిలింస్

చేయించుకుందన్న పేరొకటి రావడమే మిగిలి పోయింది !'' అనేది కాని, అమ్మ ముఖంమీద సంతోషరేఖ కనిపించేది చంపకి.

అమ్మ, వడ్డించుకు తింటున్నంతసేపూ చంప అమ్మ పక్కనే కూర్చొనేది. రామం, శ్రీనూ కూడా అక్కడే ఉండేవారు. నాన్న చూస్తూ ఉండగా అమ్మ తినదు కాబట్టి, నాన్న వీధిలోకి వెళ్లి పోయేవారు.

ఒకసారి సాంసారిక తుఫాను వీచి చల్లబడ్డాక, మరో రెండువారాల వరకు ఏ గొడవా ఉండదు. కాని నాన్న, అమ్మకిచ్చిన వాగ్దానాలన్నీ మూడో రోజుకల్లా మాయమయ్యేవి ! కొంటానన్న చీర ఎప్పుడూ కొనబడేది కాదు ! చేయిస్తానన్న నగలు ఎప్పుడూ చేయించబడేవి కావు. కొంటానన్న బంగారం ఎప్పుడూ కొనబడేది కాదు.

అమ్మ ఆ సంగతి గుర్తుచేస్తే, ''కొంటాలే ! పెద్దపండక్కి !'' అంటూ మాట తప్పిస్తారు. లేదా ... ''ప్రమోషన్ రానీ !'' అంటారు. ఎన్నో పండుగలు వస్తాయి, వెళ్తాయి ... ! ప్రమోషనా? అదెప్పుడూ రాదు. జీతమూ ఒక్క రూపాయన్నా ఎక్కువవదు !

ఇంతలో, రామం పబ్లిక్ పరీక్షలకి డబ్బు కట్టడానికి, అప్పుచెయ్యకా తప్పలేదు ! రామం మంచి మార్కులతో పరీక్ష పాసుకాకా తప్పదు అని అందరికీ తెలుసు. మంచి మార్కులు వచ్చేయి కాబట్టి రామాన్ని కాలేజీలో చేర్పక తప్పదని నిశ్చయం జరగడం, అమ్మ వంటిమీది బంగారం అమ్మడం, జరగక తప్పదని అందరికీ తెలుసు.

అమ్మ కనే కలలు కలలుగానే మిగిలిపోతాయని చంపకి తెలుసు.

నాన్నమ్మ కోడలిని (అమ్మని) ఓదార్చేది ''నీకేమే అమ్మలూ ! రామిగాడు చేతికందుకొస్తే నువ్వు పట్టిందల్లా బంగారం ఔతుంది ! చూస్తూ ఉండు ! నేను చెప్తున్నానుగా !'' అనేది

''ఆఁ ! వాళ్లు అందుకొచ్చేరు ! అయింది సంబరం !'' అనేది అమ్మ.

కాని అమ్మకి మాత్రం ఆశలు లేవా? ఎందుకు లేవు ? ఉండేవి ... అందుకే ఒంటరిగా పెరటి గుమ్మంలో తులసికోట ముందు కూర్చున్నప్పుడు తులసికోట ముందు వెలిగించిన సంధ్యా దీపాన్ని, ''ఓ దీపమా ! వెలుగు చూపు ! ఈ చీకటి పారద్రోలు !'' అన్నట్టు ఆశగా, కలల కళ్లతో చూసేది !



## 5

రామం కాలేజీలో చేరేడు. శ్రీను మెట్రిక్‌కి వచ్చేడు.

రామంని ఆర్ట్స్‌లో చేర్పడమా, సైన్స్‌లో చేర్పడమా అన్న మీమాంస జరిగాక సైన్సులో చేర్పడమే మంచిది అన్న ఉద్దేశం అందరూ వ్యక్త పరచడంతో సైన్స్‌లో చేర్పించేరు. సైన్స్ గ్రూప్ లెక్కలతో సహా తీసుకుంటే ఇంజనీరింగ్‌లో చేరొచ్చు. బయాలజీ ఎక్స్‌ట్రాగా గ్రూప్ తీసుకుంటే మెడిసిన్‌కి ప్రయత్నించవచ్చు.

సెలవల్లో నాన్న తనకు తెలిసిన వాళ్లందరినీ వారి అభిప్రాయాలు అడక్కుండా వదిలిపెట్టలేదు. సాయంత్రం పూట నాన్న వీధి వరండాలో కుర్చీ వేసుకు కూర్చొని, ''చంపా ! అగ్గిపెట్టె అయి పోయింది ! దేవుడి దగ్గరున్నది పట్రా!'' అనేవారు.

అప్పుడు అలారోడ్డు మించివెళ్తున్న హైస్కూలు లోని చిన్న తెలుగు మాష్టారు .. ''ఏం కాశీపతి గారూ ! ఏమిటి విశేషాలు ?'' అంటూ పలకరింపుగా అనగానే, నాన్న ఆయన్ని ఆహ్వానించి కూర్చో పెట్టేవారు.

హైస్కూల్లో ఇద్దరు తెలుగు పండితు లున్నారు. చిన్న తెలుగు మాష్టారు . పెద్ద

తెలుగు మాష్టార్లయి అని. పెద్దతెలుగు మాష్టారు వయసులో పెద్దేకాక తొమ్మిదో క్లాస్‌నించీ, ఎస్. ఎస్. ఎల్. సి. వరకూ తెలుగు పాఠాలు చెప్తారు. చిన్నతెలుగు మాష్టారు నాలుగో క్లాస్ నుంచి ఎనిమిదో క్లాస్‌వరకూ చదువు చెప్తారు. గుండూ, పిలకా ... పిలక్కి మందార పువ్వూ ... నుదుట అంగారు బొట్టూ, కోటూ, పంచా ... లాల్చీ ... చేతిలో పాతగొడుగు ... కాళ్లకు కిర్రు చెప్పులు. అంతా పాత పద్ధతి.

ఇద్దరూ కూర్చొని చర్చించేవారు. అప్పటి కింకా రామం ఫలితాలు రాలేదు. "మీ వాడికి మంచి మార్కులొస్తాయి ... సైన్సులోనే పెట్టండి..." అంటూ సలహా.

"చంపా ! అమ్మని టీ చెయ్యమను !" అని నాన్న అంటే, తెలుగు మాష్టారు మాటవరస కన్నా వద్దనేవారు కారు !

చంప, లోనికి వెళ్లిచెప్పేది అమ్మతో నాన్న కోరిన టీ సంగతి.

అమ్మ నిర్మొహమాటంగా బైటికి వినబడేటట్టు, "పంచదార అయిపోయిందని చెప్పు!" అనగానే, ఆ మాటలు వినిపించి మాష్టారు ... "ఇప్పుడేమీ వద్దు కాశీ !" అనేవారు.

"నాన్నా ! పంచదార అయిపోయిందని అమ్మ చెప్పమంది !" చంప దీర్ఘాలు తీస్తూ అనేది, ఆ సంగతి చెప్పడం తన కిష్టంలేనట్టు.

"మొన్ననేగా తెచ్చాను పంచదార ?" నాన్న కేక !

మొన్ననే అంటే పదిరోజుల క్రితం అని లెక్క కట్టవచ్చు. ఉదయం కాఫీలకీ, నాన్న ఆఫీస్ నుంచి రాగానే టీకి, వీటన్నింటికీ నెలకి ఐదు శేరులుండాలి. "పంచదార లేదు ! అయిపోయింది... రేపు కాఫీలోకి ఎలాగ ?" అనగనే నాన్న ఎగిరిపడి, చంపని పిలిచి, "చంపా ! డోకి రామ్మూర్తికొట్టుకి వెళ్లి పావుశేరు పంచదార తీసుకురా!" అని హుకుం!

పావుకిలో రెండురోజులు రాదు. శేరు పంచదార ఒక్కసారి నాన్న తెప్పించరు నెల మధ్యలో. "శేరు తెప్పించినా రెండురోజుల్లోనే సరి ! పావుశేరు తెప్పించినా ఆ రెండురోజుల్లోనే సరి ! మీ ఖర్చుకి మితిలేదు !" అంటారు.

నాన్న లెక్కలన్నీ వింతగా ఉంటాయి చంపకి. సిగరెట్లు ఒకదానిమీద ఒకటి కాల్చేస్తూ, రంగడికి నెలా అయ్యేసరికి ఇరవై రూపాయలూ సమర్పించు కుంటారు ... కాని ఇంట్లో అందరికీ కావల్సిన పంచదార అనేసరికి లెక్కలు కడతారు.

టీ లేక పోవడంతో, తెలుగుమాష్టారి మధ్యా, నాన్న మధ్యా కబుర్లు వేగం తెమిలిపోతాయి. మధ్యని మాష్టారు ... "ఏం చంపా ! రేపోసారి కనిపించు ! నీ తెలుగు పేపరు దిద్దుతాను !" అంటూ వీపు తట్టేవారు !

తెలుగు మాష్టారికి తనంటే ఇష్టం. అందుకు తనకి గర్వం. తెలుగులో ఎప్పుడూ యాభైకి తక్కువ రాలేదు. క్లాసులో ఎప్పుడూ ఫస్టో, సెకెండో వచ్చేది.

తెలుగుమాష్టారికి తనంటే ఎందుకిష్టం ? కొందరికి కొందరంటే ఇష్టం. నాన్నకీ తనంటే ఇష్టమె. తను తెల్లగా ఉంటుంది కాబట్టి తనంటే అందరికీ ఇష్టం అని చంప అనుకొనేది, అద్దంలో తన ముఖం చూసుకున్నప్పుడల్లా.

కాని లెక్కల్లో ఎప్పుడూ తనకి నలభై కన్న ఎక్కువ రాలేదు. లెక్కల మాష్టారు లెక్కలు చెప్తూ, "అర్థమయిందా ?" అంటే అర్థమయింది అన్నట్టు తల ఊపేది. లెక్కలన్నా, లెక్కల మాష్టారన్నా భయం !

బట్టబుర్ర లెక్కల మాష్టారు, హోమ్‌వర్క్ చెయ్యకపోయినా, సరిగ్గా లెక్కలు అర్థం చేసుకోక పోయినా, మగ స్టూడెంట్ల దగ్గరికి వెళ్లి ఓ చేత్తో జుత్తుపట్టుకొని, రెండో చేత్తో ఠణ్ ఠణ్ మని మొట్టికాయలు మొట్టేవారు. కాని, అమ్మాయిల్ని ఏమీ అనేవారు కారు. చీవాట్లు పెట్టేవారు. ఆయన తిడితే తల తీసేసినట్టుండేది.

ఆ భయంవల్ల, లెక్కల మాష్టారు బ్లాక్ బోర్డుమీద స్టెప్స్ వేస్తూ లెక్కని చకచకా చెప్పేస్తే, అందరూ అర్థమయిపోయినట్టు గంగిరెద్దుల్లా తలలూపేవారు.

హోమ్‌వర్క్‌లో రామాన్ని, చంప సాయం అడుగుతే వాడు తెగ మురిపించేవాడు. "రామం అన్నయ్యా ! ఈ హోమ్‌వర్క్ కాస్త చెప్పు !" అనగానే ... "నాకు టైమ్‌లేదు ! రేపు క్లాస్‌లో లెక్కల మాష్టార్ని అడుగు !" అనేవాడు.

శ్రీనుగాడ్ని అడుగుతే వాడంతకన్నాను !

"నాన్నా ! అన్నయ్య లెక్కలు చెప్పమంటే చెప్పడంలేదు !" అంటూ కంప్లేంటిస్తే ... "ఒరే రామం ! ఆ లెక్కలేమిటో చూడు !" అని నాన్న అర్చారు. నాన్న చెప్పిన మాట వినకపోతే అన్నకి దేహశుద్ధి అప్పుడప్పుడు.

ఎనిమిదో క్లాస్ దాటేసేక అన్నలని కొట్టడం మానేసారు నన్న. అంతవరకూ వాళ్లు ఏం పెంకితనం చేసినా వీపు విమానం మోతమోగి పోయేది.

తెలుగు మాష్టారింటికి మర్నాడు వెళ్లేది చంప. తముంటున్న వీధిలోనే ఉంటున్నారాయన. చంప రాగానే మాష్టారు ఆన్సర్ పుస్తకాల కట్ట తీసి, చంప ఆన్సర్ పేపరు ఆమె ముందే దిద్దేవారు.

"నీ దస్తూరీ, నీ అక్షరాలు పాలకోవాల్లా ఉంటాయే ! చంప అంటే సంపంగి పువ్వు! ఆడదాని ముక్కుని సంపంగి పువ్వుతో పోలుస్తారు కవులు !"

"ఎందుకు మాష్టారు అలా పోలుస్తారు ?"

"అవన్నీ ఉపమానాలు. వచ్చేఏడు నువ్వు ఛందస్సు, అలంకార శాస్త్రం నేర్చుకున్నప్పుడు తెలుస్తుందిలే !" అని భార్యకో కేక..., 'ఏవోయి! నీ కోడలొచ్చింది ! కజ్జికాయలు చేసేవ్ కదా ? దానికీ రెండు పెట్టు !"

"రావమ్మా కోడలా ! ఇలారా వంటింట్లోకి!" అని మాష్టారిభార్య.

మాష్టారికి కూతుళ్లు లేరు. ఉన్న ముగ్గురూ కొడుకులే. అందువల్ల చంప అంటే గారం.

పేపరు తనని కూర్చోపెట్టి దిద్దినప్పుడు తనకి ఫస్ట్ మార్కిచ్చేవారు. "పారిశుభ్రతమీద ఎంత చక్కటి వ్యాసం రాసింది ! ఏవోయ్ ! ఇలా వచ్చి విను ! నీ కోడలు మంచి రచయిత్రవుతుంది!" అంటూ మాష్టారి కేక. మురిసిపోతూ మార్కులు వడేసేవారు.

ఆ సమయానికి మాష్టారి పెద్దకొడుకు గిరిగాడు అక్కడుంటే ... "ఏంరా గిరీ చంపని పెళ్లాడతావ్‌రా ?" అంటూ అడిగేవారు. అందుకు గిరిగాడు తెగ సిగ్గుపడిపోయేవాడు. చంపకి సిగ్గని పించేదికాదు. తన పెళ్లి గురించి అమ్మా, నాన్నా ఎన్నోసార్లనుకున్నారు. విన్న సంగతే వినీ వినీ సిగ్గు పడీ, సిగ్గుపడీ, మరి సిగ్గుపడ్డానికి ఓపిక లేకపోయింది !

ఆడుకుందుకి ఇరుగు పొరుగు ఆడపిల్లలే కాక, అన్నలతో కూడా తనూ ఆడుకుంటానని పట్టు పట్టేది ఆరోఏడు వంటపట్టేన దగ్గర్నించీ.

## రాబోకు దీపావళీ !

రాకు దీపావళీ మా వీధి;
మాకిక్కడ నిత్యమూ నిశీధి.
చిక్కటి చీకటిలో దిక్కుమాలిన మా యిళ్లు
ఒక్కటీ కనపడదు పొడుముకున్నా నీ కళ్లు —
దారి చూపిద్దామంటే నీకు మేము
గోరంత దీపమైనా పెట్టలేము;
పసికందు తాళువకే లేదు తైలం,
ప్రమిదలందు ఏమి పోయగలం ?
మానం దాచుకుందికే లేదు నూలుపోగు
మరి వత్తులు చేసి వెలిగించడమేలాగు ? —
కదలిరాలేవు నీవు మా కారుచీకటి మురికివాడకు
బెదిరిపోయి నీకు నీవే పరమకొన్న పిరికినీడకు !
అందుకని, ఓ దీవాళీ ! ముందుగా వెలిగించుకో
ముందున్న "చీకటి బజారు" బాట;
ఆనక ఆలోచించుకుందాములే
అంధకారాన్ని తొలగించే మాట !

— "సవ్యశ్రీ"



రామం, శ్రీనూ తక్కిన పిల్లల్తో కలిసి, వేసవి సెలవల్లో మామిడికాయలు ఏరడానికీ, ఈత పళ్ళు ఏరడానికీ తోటలకి వెళ్ళేవారు. చంపా వాళ్ళతో వెళ్తాననేది. "నువ్వా! నువ్వు ఆడపిల్లవి! రాడానికి వీల్లేదు!" అనేవారు. నాన్నారితో చెప్పి తన్నిస్తాననేది చంప. ఆ బెదిరింపుని వాళ్ళు లెక్కచెయ్యకపోతే ఏడ్చేది.

ఆమె బాధపడలేక అప్పుడప్పుడూ జట్టులో చేర్చేవారు. తనను చేర్చగానే తక్కిన అన్నలూ చెల్లెళ్ళూ తాము వస్తామనేవారు. దాంతో ఆడా మగా దండుగా వెళ్ళేవారు. ఆడా మగా కలిసే ఆటలాడేవారు. కాని వాళ్ళు ఎనిమిదో క్లాస్ దాటేసేక, ఆడవేరూ, మగవేరూ అన్నారు. రోడ్డుమీద ఫుట్‌బాల్ ఆడ్డం, క్రికెట్ ఆడ్డం ఆరంభించేవారు. దాగుడుమూతల ఆటలకీ, కేరమ్స్ ఆటలకీ, వానా వానా ఆటలకీ స్వస్తి. రామం, శ్రీనూ వాళ్ళేదో రాజుకొడుకులైపోయినట్టుగా టెక్కు చూపించేవారు. "ఇంక నువ్వు మాతో ఆడ్డానికి వీల్లేదు. ఆడపిల్లలతో ఆడుకో!" అనేవాడు శ్రీను.

చంప వెళ్ళి నాన్నకి ఫిర్యాదు చేసేది. కాని నాన్నకి కూడా వాళ్ళమీద అధికారం ఈ ఆటల విషయంలో పూర్తిగా పోయినట్టు గ్రహించింది.









"చూడు చంపా! వాళ్ళు పెద్దవాళ్లయి పోయేరు. ఆడపిల్లల్తో ఇంక ఆడరు!" అంటూ అదోలా విరునవ్వు.

"ఎందుకాడరు నాన్నా? క్రిందటి ఏటి వరకూ ఆడేరు!"

"గడ్డాలూ, మీసాలూ వచ్చేక మళ్లీ ఆడతారులే! అప్పుడు మీరెవరూ వాళ్ళకి ఆమడ దూరాని కన్నా వెళ్లరు. కాలేజీలో చేరేక నీకే తెలుస్తుంది మగ పిల్లల తడాకా!" అంటూ నాన్న.

"దాంతో ఏమిటా కబుర్లు?" అమ్మ ఒక చెవి ఇటు పారేసి.

కాలేజీలో తమా చేరుతుందా? ఇంకా ఏదీ... ఇప్పుడు క్లాసు ఎనిమిదినుంచి తొమ్మిది కింకా వెళ్తుంది. ఇంకా మూడేళ్ళు! వోరి బాబోయ్! ఇంకా చాలాకాలం ఉంది! ఇవే ఆఖరు వేసవి శెలవలు రామంతోనూ, వాడి స్నేహితులతోనూ తిరగడానికి. కాలేజి స్టూడెంటయిపోతే తమ సంగతి పట్టించుకోడు. నాన్నతోబాటు వాడూ కసరడం, తిట్టడం చేస్తాడు. అందువల్ల చంప, శెలవలు రెండు నెలలూ అన్నతో తిరగడానికే నిశ్చయించుకుంది. కాని, రామం మూడ్‌లో లేడు. ఫస్ట్‌క్లాస్ మార్కులు వస్తాయా రవా? వచ్చేక సైన్సులో చేరడం ఔతుందా అవదా? ఇవే ఆలోచనలు — ఇవే కబుర్లు — ఆ కబుర్లు వినలేక బోర్‌కొట్టి తనే వాళ్లతో తిరగడం మానేసింది.

రిజల్ట్సు వచ్చేయి. రామం అరవై శాతంపైని మార్కులతో పాసయ్యాడు. సినీమాల్లోని హీరోలకే కాదు, రామం అన్నయ్యకి కూడా ఫస్ట్ క్లాసొచ్చింది, అనుకుంది చంప. ఒక్కసారిగా అన్నయ్య పెద్దవాడయిపోయి, ఎంతో ఎత్తు ఎదిగిపోయినట్టయింది చంపకి. ఇంక తనని వాడితో తిరగనివ్వడు. వాడి ఫ్రెండ్సు, వాడి తిరుగుళ్ళు వేరవుతాయి. ఇంక వాడిని రాజుకొడుకులా చూస్తారు అమ్మా, నాన్నా. వాడికి తనమీదా, శ్రీనుగాడిమీదా అధికారాన్ని అప్పగిస్తారు తప్పదు.

రామం తను పాసయినట్టు ఆనందంతో పరుగున వచ్చి చెప్పినప్పుడు, నాన్న ముఖం మతాబాలా వెలిగిపోయింది. అమ్మ, వంట ఇంట్లోంచి పరుగున వచ్చి కొడుకుని పొదివి పట్టుకొని, "నా తండ్రే! నా బంగారు కొండే!" అంది.

నాన్నమ్మకీ వార్త ఎక్కడ వినిపించిందో కాని ఆమె కూడా ఆదరా బాదరగా వచ్చింది, "ఏమయింది అమ్మలూ!" అంటూ.

"రామం ఫస్టుగా పాసయేడత్తా!" అనగానే, ఫస్టుగా పాసవడం అంటే ఏమిటో తెలియకపోయినా, పాసయేడు అన్నమాటకి అర్థం తెలియడం వల్ల, "పాసయేడూ వెర్రినాగన్న?!" అంటూ రామాన్ని కౌగిలించుకుంది. తరవాత నాన్నతో అంది... "ఒరే కాశీ! అలా దుకాణంకి వెళ్లి శనగపిండీ, పంచదారా, నూనే, డాల్డా పట్రా! జంతికలూ, మైసూర్‌పాకూ చేస్తాను!" అంది. ఆమె మాటలు ఎవరూ ఖండించలేదు. చంపకీ, శ్రీనుకీ ఆ పని తగిల్చేరు నాన్న. మరి ఆ క్షణంనుంచీ చిల్లర పనులు రామానికి పురమాయించటం బందయిపోయింది.

"నాన్నా! నేను సైన్సులో చేరుతాను!" అని రామం తన దృఢ అభిప్రాయాన్ని చెప్పి, ఈ శెలవలు రెండు నెలలూ నాన్న అందరితోనూ చేసిన తర్జన భర్జనలకి ఫుల్‌స్టాప్ పెట్టేడు. అరవై శాతంకి పైగా మార్కులు వచ్చి ఉండకపోతే రామం ఇలా అనగలిగి ఉండేవాడా, అని రామంకి అంత అథారిటీ ఇచ్చిన ఫస్ట్‌క్లాస్‌ని తిట్టుకుంది చంప మనసులో.

"అలానే బాబూ! సైన్సులోనే చేరు—ఇంద, ఈ రూపాయి తీసుకువెళ్లి నీ ఫ్రెండ్సుకి పార్టీ చెయ్యి!" అంటూ రూపాయిచ్చేరు నాన్న! అంతకు అరగంట క్రితమే అమ్మ బజారుకి వెళ్లి వో పావలా బెండకాయలు తెమ్మంటే డబ్బుల్లేవన్నారు నాన్న!

## 6

రామం కాలేజీలో చేరేడు సైన్సు గ్రూప్‌లో.

అమ్మ, గాజులు అమ్మక తప్పలేదు. "ఈ గాజులు అమ్మడంతోనే కాలేజీ చదువంతా అయిపోతే, అంతకన్న ఏం కావాలి? ఇంకా ఎన్నెన్ని వస్తువు లమ్మాలో? అమ్మాలన్నా ఏమీలేవు!" అని అమ్మ వాపోవడం చంప గమనించి చాటుగా కన్నీరు పెట్టుకుంది. చంప చాలా బాధపడింది.

రామం అంతగా బాధపడినట్టు లేదు. శ్రీనివాస్ బాధపడ్డాడు. ఇందులో రామానికి స్వార్థం ఉంది కాబట్టి వాడు కిక్కురుమనలేదు. తనకోసం అందరూ అన్ని త్యాగాలూ చెయ్యాలని అనుకుంటున్నాడో ఏమో?

"ఇంటికి పెద్దకొడుకు! వాడు చేతికి అందుకొస్తే అన్ని కష్టాలూ గట్టెక్కుతాయి! చూస్తూ ఉండండి! నా మనవడు కలెక్టరయి కారులో నిన్నూ, నన్నూ, అందరినీ తిప్పుతాడు!" అంది నాన్నమ్మ.

ఊళ్ళోని చుట్టాలూ, పక్కాలూ అందరూ రావడం, అమ్మని అభినందించడం, అమ్మ గర్వపడడం, ఆనందంతో కన్నీరు కార్చడం, ఆ కార్యక్రమం అంతా అయిపోయింది, ఏనాడయ్యో! ఇప్పుడు బంగారు గాజుల అమ్మకం కార్యక్రమం నడుస్తోంది.

చంప పెరట్లోకి వెళ్లి మామిడి చెట్టు కొమ్మకి కట్టిన తాడు ఉయ్యాలలో ఒక్కర్తే కూర్చుంది, విచారంగా. రామమన్నయ్య పెద్ద చదువులు చదివి, పెద్ద ఉద్యోగం చేసి, అమ్మనీ, నాన్ననీ, తననీ డబ్బుతో ముంచేస్తాడని అందరూ ఒకటే రొద. కాని తనతో ఆటలు ఆడనివ్వడానికే వద్దని అడ్డుపెట్టే అన్నయ్య, ఎంతవరకూ అమ్మా, నాన్నల ఆశలు నిలబెడతాడు? అదంతా అయ్యేసరికి ఎన్ని ఏళ్లు పడుతుందో? అంత చదువు చదివించడానికి నాన్నకి డబ్బు ఎక్కడిది? వచ్చే ఏడు శ్రీను కూడా బాగా చదివి, ఫస్ట్‌క్లాస్ తెచ్చుకొని కాలేజిలో చేర్పించమని కూర్చుంటాడు... మరి వాడికి డబ్బెక్కడిది?



# స్పందన

నాన్నని, అమ్మనీ తలుచుకొనే సరికి ఎందుకో కళ్లల్లో నీళ్లు తిరిగేయి చంపకి.

"హో చంపా! ఎక్కడున్నావే? హోసారి ఇలా రా తల్లీ!" అమ్మ కేకకి చంప జవాబివ్వలేదు. రామం అన్నయ్య ఒక మహారాజయినట్టు అందరూ ప్రవర్తించడం చంప మనసుని బాధ పెట్టింది. ఉయ్యాల ఊగడం ఆరంభించింది మామిడి చెట్టు కింద చంప. తమ ఇంట్లో ఈ రోజునుంచి ఏదో మార్పు వచ్చినట్టుగా అనిపించింది. ఇంక అందరి దృష్టి, ఆలోచనలూ రామం పెద్ద చదువులు చదివి, పెద్ద ఉద్యోగం చెయ్యడం మీద నిలిచి ఉంటాయి.

"చంపా!" నాన్న కేక. ఈ కేకకి జవాబివ్వక తప్పింది కాదు. "వస్తున్నా నాన్నా!" పరుగున వెళ్లింది చంప. "ఏం కావాలి నాన్నా?"

నాన్న బయట అరుగుమీద కుర్చీలో కూర్చున్నారు. అక్కడ చీకటిగా ఉంది. "చంపా! రంగడి కొట్టుకి వెళ్లి ఒక సిగరెట్టు పెట్టి పట్రా! ఇదే ఆఖరు. మరి రేపట్నించి కాల్చను!" అన్నారు ఎటో చూస్తూ నాన్న.

చంప ఆశ్చర్యపోయింది. నాన్న ఎంతో ముసలి అయిపోయినట్టు కనిపించారు. నాన్నమీద అపారమైన జాలివేసింది. దగ్గరగా వెళ్లి, చనువుగా నాన్న జుత్తులోకి వేళ్లు దూర్చి... "ఎందుకు నాన్నా సిగరెట్లు మానేస్తావు?" అంది గోముగా.

"మరి పెద్దవాడి చదువెలా సాగుతుందమ్మా? అమ్మ, గాజులు ఇచ్చేసింది. నేను సిగరెట్లు మానేస్తే నెలకి పాతిక, ముప్పయి అన్నా మిగుల్తుంది!" అన్నారు నాన్న చంప తల నిమురుతూ.

"పోనీ రోజుకో పెట్టె కాల్చు నాన్నా!" అని చంప హోదార్చగానే, నాన్న చంపని దగ్గరగా తీసుకుని, "నీ ఒక్కర్తికే నే అంటే కాస్త అపేక్ష ఉందే చంపా!" అంటూ బుగ్గమీద ముద్దు పెట్టుకున్నారు.

ఆనందంతో పొంగిపోయింది చంప. మనసు పరవళ్లు తొక్కింది. పరుగున వెళ్లి, రంగడి కొట్టునుంచి సిగరెట్టుపెట్టె తెచ్చి ఇచ్చింది. కాని నాన్న సిగరెట్టు వెలిగించలేదు. ఆ పెట్టె అలా జేబులోనే పెట్టుకున్నారు.

మర్నాటి నుంచీ ఆ పెట్టె అలానే ఉండిపోయింది ఇంట్లో టేబుల్‌మీద. సిగరెట్లు కాల్చడం మానేసారు నాన్న!

"చంపా! సిగరెట్టుతే రంగడి కొట్టునుంచి!" అని పొరపాటున అతడంటే, చంప టేబుల్‌మీది సిగరెట్టుపెట్టె ఇవ్వగా, దానిని చేతిలో పట్టుకు నిట్టూర్చి, జేబులో పెట్టుకుంటారు. తరవాత అది మళ్లా టేబుల్‌మీదకే వెళ్లిపోతుంది.

అమ్మ గాజులు ఇవ్వడం కన్నా, నాన్న సిగరెట్లు మానడం పెద్ద త్యాగం అనిపించింది చంపకి. కాని రామం అన్నయ్య ఈ విలువలని గ్రహించగలడా అన్న అనుమానం వచ్చేది చంపకి!

(ఇంకా ఉంది)

# రెండు రోజుల పండుగ దీపావళి!

మనకు ప్రతి సంవత్సరం ఎన్నో పండుగలు, పర్వాలు వస్తూ ఉంటాయి. ఆ ముఖ్యమైన వాటిలో దీపావళి ప్రధానమై ఉంది.

పండుగలు సంతోషంగా గడిపేవి. పర్వాలలో వ్రతాలూ, పూజాలూ, నైమిత్తిక కర్మలూ ప్రధానాలు. ఈ పండుగ, పర్వం చేరి వచ్చేవి మాత్రం కొద్దిగా ఉన్నాయి. అవి చాంద్రమానాన్ననుసరించిన దీపావళి, సౌరమానాన్ననుసరించిన మకర సంక్రాంతిన్నీ.

సంక్రాంతి ముందురోజు భోగి పండుగ. ఆ దినం వ్రతాలూ, అవీ ప్రత్యేకంగా ఉండవు. మర్నాడే విహిత కర్మలు జరుపబడుతవి. ఆ విధంగానే దీపావళి ముందురోజు నరకచతుర్దశిని కూడా, భోగి పండుగువలెనే జరుపుకుంటారు. నరక చతుర్దశినాడు నరకాసురుడి గడ్డి బొమ్మను దహిస్తారు. భోగినాడు భోగిమంటలు వేస్తారు.

నరకచతుర్దశినాటి వినోదాల్లో టపాసులను, మతాబాలను కాల్చడం ఒక ప్రత్యేకతకు నిదర్శనం. దీపావళినాడు దీపపూజ, మాలికలుగా ప్రమిదల నుంచి దీపారాధన చెయ్యడం ముఖ్యం.

ఇలా జరపడం అనుస్యూతంగా వస్తూ ఉన్న ఆచారం.

కాలమానాన్నిబట్టి సంవత్సరాన్ని ఉత్తరాయణ, దక్షిణాయనాలుగా విభజించారు. ఈ రెండు విభాగాలలో మకర సంక్రమణం మొదలుకొని కర్కాటక సంక్రమణం వరకూ ఉన్న ఆరునెలల కాలం ఉత్తరాయణం. కర్కాటక సంక్రాంతి మొదలుకొని మకర సంక్రమణం వరకు ఉన్నకాలం దక్షిణాయనం. ఈ రెండింటిలోను ఉత్తరాయణం శ్రేష్ఠమయినది. దక్షిణాయనం రాత్రికీ, ఉత్తరాయణం పగటికీ ప్రతీకలు. రాత్రి జీవరాశి గాఢ నిద్రా ముద్రితమై ఉంటుంది. పగటిపూట చురుకుతనంతో కార్యకలాపాలు నెరవేరుస్తుంది. జీవనోపాధి సంపాదనకు అదే తగిన సమయం కూడా. ఈ రాత్రింబగళ్ల మధ్య వున్న రాత్రి నాలుగవ జాములో ఈ దీపావళి—దక్షిణాయన చివరిభాగంలో వస్తుంది. నిద్రిస్తున్న జనాన్ని మేలుకొలిపే సమయం ఇది. పూర్వకాలంలో రాజులను నిద్ర మేల్కొలుపుటకు పరిచారకులకు ధైర్యం వుండేది కాదు. లేపకపోతే రాజులకు వారిపైని కోపం వస్తుంది. ఈ చిక్కు తొలగించడానికే తెల్లవారుజామున కోట గోపురాల మీద నగారా మ్రోగించడం జరిగేది. అదే విధంగా జనసామాన్యాన్ని మేలుకొల్పడానికే టపాసులు పేల్చడం ఆచారంలోకి వచ్చినట్లు ఊహించవచ్చును.






దీనిని మరొక విధంగా కూడా ఊహించడానికి అవకాశం ఉన్నది.

నిశారూపమైన దక్షిణాయనం అజ్ఞానానికి సూచకం. ఉత్తరాయణం వెలుగుతో నిండి ఉన్నందున విజ్ఞానాన్ని సూచిస్తుంది. "తమసో మా జ్యోతిర్గమయ" అనే మహా వాక్యాన్ని అనుసరించి మానవునికి అజ్ఞానాన్ని పోగొట్టి జ్ఞానాన్ని పొందేటట్లు చెయ్యడానికి (నడుమనున్న) దీపావళి ప్రబోధ రూపమై ఉంటుంది. ఉత్తమ జ్ఞానులు చేసిన ప్రబోధంవలె ఉంటుంది.

నరకాసురుడి వధతో దీపావళికి సంబంధం ఉన్న సంగతి అందరూ ఎరుగుదురు. నరకాసురుడి వల్ల కలిగే హింసలకు సహించలేక ప్రజానీకం శ్రీకృష్ణునితో మొర పెట్టుకోగా, అతడు ఆ రాక్షసుని సంహరించాడు. ప్రజల బాధలను తొలగించి, వారికి సుఖక్షేమాలు కలిగించాడు. అప్పుడు సత్యభామ కూడా శ్రీకృష్ణునితో పోయి, యుద్ధంలో అతనికి సహాయం చేసిందట!- ఈ విషయం పోతన భాగవతం మొదలైన కొన్నిట్లో కనబడుతున్నదే కాని, విష్ణు పురాణం మొదలైన గ్రంథాల్లో కానరాదు. శ్రీకృష్ణునితో కూడా ఆమె వెళ్లినదని మాత్రమే వాటిలో ఉన్నది.

ఈ నరకాసురవధ కథవల్ల ఒక విషయాన్ని ఊహించవచ్చును.

"మృత్యోర్మా అమృతం గమయ" అనే మహా వాక్యాన్ని బట్టి కష్టాలనుండి తప్పించి సుఖాలను కలిగించాలనే ప్రార్థన దీనివల్ల వ్యక్తమవుతుంది. నరకుడు కష్టాలకు ప్రతీక. తన్నే నమ్ముకున్న జనుల మొర విని భగవంతుడు వారికి అభయమిచ్చి కష్టాలను తొలగించడం దీనివల్ల గ్రహించవచ్చును.

భగవంతుడు భక్తులపై వాత్సల్యం చూపడంలో ఆయన అర్ధాంగి ప్రేరకురాలై ఉంటుంది.

**"అంగీరస"**

## కార్టూనిస్టులకు సూచనలు !

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితం మీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి. ★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్‌మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్లలు అంటించిన కవరు గల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది — దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీ గాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది — పరిశీలనకి ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు—బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం —

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్ల కాగితం మీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

— సం॥


జీవం
ఉట్టిపడేలాగ
మురియండి
Liril
THE FRESHNESS SOAP
Liril

# కథ, సశేషం

(18 వ పేజీ తరువాయి)

పంపితే, ఇక గొడవ వుండదు అని ఆమె భావించి వుండవచ్చు.

వనజ భర్త వానాకాలంలో చదువుకున్న వాడు. పెద్దగా తెలివిలేదు. సంపాదన తెలియనివాడు. వయస్సు ఇరవై దాటదు. తెలిసీతెలియని అనుబంధాలు.

పెళ్ళయిన మరుసటి సంవత్సరం వనజ చచ్చినబిడ్డనుకన్నది. వాళ్ళున్నది పల్లెటూరు. ఆరోగ్య సదుపాయాలు అంతంత మాత్రం. దానితో వనజ ఆరోగ్యం బాగా పాడయి పోయింది. తండ్రి వనజను మళ్ళీ ఇంటికి తీసుకుని వచ్చాడు, కాస్త ఆరోగ్యం కుదుట పడేవరకూ వుంచుకుని పంపించి వేద్దామని.

వనజ భర్త ఎటో వెళ్ళి పోయాడట తర్వాత. ఎందుకెళ్ళాడో, ఎక్కడికెళ్ళాడో ఈనాటి వరకూ ఎవరికీ తెలియదు. ఉన్నాడో లేడో కూడా తెలియదు. ఆ పల్లెటూళ్ళో ఓ సర్కసు వేయగా, ఆ కంపెనీ వాళ్ళతోపాటు వెళ్ళినట్టు ఒక వదంతి. ఏమైనా అతని జాడ లేదు.

అందువల్ల వనజ తండ్రి దగ్గరే వుండి పోయింది. భర్త గురించి వనజ పెద్దగా బాధపడలేదు. పల్లెటూరి జీవితానికి, పట్నంజీవితానికి చాలా తేడా వుండటం వల్ల బాధ పడలేదు. పొట్ట గడవక, ఒకటి రెండుసార్లు అత్తా మామలు తనని పొలం పనికి పంప డానికి ప్రయత్నించడం వనజకు మర్చిపోలేని అనుభవం. తన పెళ్ళి, గర్భం, బిడ్డ దక్కక పోవడం అంతా చెదరినకల అయింది ఆమెకు.

భూషయ్యకు సంపాదన ఫర్వాలేదు. మేడ కట్టారు. ఆ వీధిలో మేడవున్న అయిదారు గురిలో అతనొకడు. డబ్బున్నవాడుగా అతనికి ఆ వీధిలోనే కాకుండా కాస్త చుట్టుప్రక్కల కూడా పేరు సంపాదించుకున్నాడు.

భూషయ్య వనజ గురించి ఏం చెయ్యా అన్న సమస్య వచ్చి పడంది. భర్తలేదు. మళ్ళీ పెళ్ళి చేయడం తన అంతస్తుకు మంచిది కాదు. అదీకాక, ఆ భర్త వున్నాడో చచ్చాడో తెలియదు. వనజను మెట్రిక్ చదివించి, టైపు నేర్పించి ఓ ఉద్యోగస్థురాలిని చెయ్యమని కాంతమ్మ సలహా ఇచ్చింది. చాలా మంచి సలహా!

ఆ విధంగా వనజ మెట్రిక్‌లో జేరింది. చదువులో పడిపోయింది. కొద్ది కొద్దిగా

# ప్రతియేటా మీకు రూ. 278 ఆదా—హాకిన్స్ ప్రెషర్ కుక్కర్‌తో ఇంధనం ఖర్చు తగ్గుతుంది




## కొన్నాక ఒక్క సంవత్సరంలో హాకిన్స్ తన ధర తానే చెల్లిస్తుంది

### మీకు కిరసనాయిలు సమస్య తీరిపోతుంది

కిరసనాయిలు దొరకడమూ కష్టం, దాని ధరా ఎక్కువే. అంచేత, సాధ్యమైనంత తక్కువ కిరసనాయిలుతో వంట చేయడానికి అన్ని విధాలుగానూ ప్రయత్నించాలి. ఆధునిక విజ్ఞానం దానికో మార్గం చూపిస్తోంది.

పరీక్ష కోసం, హాకిన్స్ ప్రెషర్ కుక్కర్‌తో శాస్త్రీయంగా వంటచేసి సరిపోల్చి చూడగా, దానివల్ల మామూలు పద్ధతిన వంట చేయడంలో కన్నా సగటున 53% కిరసనాయిలు తగ్గుతుందని ఋజువైంది. కారణం ఏమిటంటే, మామూలు పద్ధతిలో కన్నా హాకిన్స్‌తో అయితే వండటానికి పట్టే కాలం సగానికి పైగా తగ్గిపోతుంది. కిరసనాయిలనే కాదు—గ్యాస్, బొగ్గు, కర్ర, విద్యుచ్ఛక్తి లాంటి ఏ ఇతర ఇంధనమైనా సరే, ఇదే విధంగా ఆదా అవుతుంది.

### అత్యుత్తమ పెట్టుబడి

హాకిన్స్ ఉపయోగించడం వల్ల, ఓ సగటు కుటుంబం రోజుకు అర్థ లీటరు కంటె ఎక్కువగా కిరసనాయిలు ఆదా చేసుకోవచ్చు. ఒక సంవత్సరంలో, కేవలం ఇంధనం ఖర్చులో ఆదా అయిన దానితోనే హాకిన్స్ తన ధర చెల్లించి వేస్తుంది. ఏళ్ల తరబడి మీకు ఉపయోగ పడేలా రూపొందించ బడింది హాకిన్స్. అంచేత ఇవాళ మీరు దానిమీద చేసే పెట్టుబడి అతి లాభ సాటిదన్నమాట. ఇంతకు ముందెప్పుడూ మీరు ప్రెషర్ కుక్కర్ ఉపయోగించక పోయినా జంక వలసిన పని లేదు. ప్రతి హాకిన్స్ తోనూ, చేసిచూడబడిన 127 వంటలు గల సరళమైన సచిత్ర బోధనాత్మక పుస్తకం ఒకటి మీకు లభిస్తుంది. ఈ పుస్తకం 12 భారతీయ భాషల్లో లభిస్తోంది.

### నిర్వహణ ఖర్చులో ఆదా

హాకిన్స్ ఏమాత్రం ఇబ్బంది కలిగించదు. హాకిన్స్ గాస్కెట్, సేఫ్టీ వాల్వ్ మామూలు రకం ప్రెషర్ కుక్కర్లలోని వాటి కంటె ఎక్కువ కాలం మన్నుతాయి.

ప్రత్యేకమైన నమూనా కారణంగా హాకిన్స్ ప్రమాదం లేనిది. దీని మూతను తెరవాలంటే పక్కవైపు నుంచి కాక పాత్రలోపలికే దానిని దించాలి. అంచేత, లోపలి ఒత్తిడి పూర్తిగా సురక్షితమైన స్థాయికి తగ్గేవరకూ పొరపాటున కూడా మూత తెరవడానికి వీలవదు. సేఫ్టీ వాల్వ్ హేండిల్ బార్ కింద ఉండటం వల్ల అది పనిచేసినప్పుడు ప్రమాదం లేకుండా ఆవిరి కిందికి తిప్పి కొట్టబడుతుంది.

### ఉచిత సర్వీసు

హాకిన్స్‌కు వ్రాత పూర్వకమైన ఐదేళ్ల హామీ ఉంది. హామీ ఉన్న విడి భాగాలన్నీ ఉచితంగా మార్చబడతాయి. హాకిన్స్ సర్వీసు ఎల్లప్పుడూ ఉచితమే. ఫ్యాక్టరీ శిక్షణ పొందిన మెకానిక్‌లు గల హాకిన్స్ అధీకృత సర్వీసు కేంద్రాలు భారత దేశంలోని 115 పట్టణాలలో ఉన్నాయి. వీటిలో సత్వరమైన, నిపుణమైన సర్వీసు లభిస్తుంది.

### మీ కుటుంబ ఆరోగ్యానికి పెట్టుబడి చేయండి

మీరే తెలుసుకుంటారు, హాకిన్స్ మీ కుటుంబ ఆరోగ్యానికి కూడా పెట్టుబడే అని. ఎందుకంటే, మామూలు వంటకంటె దీని వంట మరింత ఆరోగ్యకరమైన ఆహారాన్ని సమకూరుస్తుంది. ప్రెషర్ కుక్కర్‌తో వండితే ఆహారంలోని పోషక విలువలు—ముఖ్యంగా విటమినులు, ప్రొటీనులు—మరింత ఎక్కువగా నిలచి ఉంటాయని కేంద్ర ఆహార మరియు సాంకేతిక పరిశోధనా సంస్థ పరిశీలనల వల్ల తేలింది. అంతేకాదు, హాకిన్స్ మీకు మరింతగా పరిశుభ్రమైన ఆహారాన్ని అందిస్తుంది కూడా. ఎందుకంటే, ఇది 122°C ఉష్ణోగ్రతలో వండటం వల్ల ఆహారంలో సూక్ష్మజీవులన్నీ నశిస్తాయి.

ఈ రోజుల్లో మీకు హాకిన్స్ ప్రెషర్ కుక్కర్ ఉండి తీరాలి. మీకు దగ్గరలోని తెలిసిన విక్రేత దగ్గరకు వెళ్లి హాకిన్స్‌ను కొనుక్కోండి. లేదా మా యీ చిరునామాకు వ్రాయండి: ప్రెషర్ కుక్కర్స్ & అప్లయన్సెస్ లిమిటెడ్, పి.ఒ. బాక్స్ 1542, బొంబాయి 400 001.




® హాకిన్స్ మరియు హాకిన్స్ యూనివర్సల్ అనేవి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్కులు,



# హాకిన్స్®

## ఏమాత్రం ఇబ్బంది కలిగించకుండా ఏళ్ల తరబడి పనిచేసేలా రూపొందించబడిన ప్రెషర్ కుక్కర్

PCA.167-2316 TL

లోకజ్ఞానం పెంచుకోసాగింది. బ్రతుకు మీద ఓ వుద్దేశ్యం ఏర్పరచుకొనడం మొదలెట్టింది. మెట్రిక్ పాసయ్యింది. ప్రైవు పరీక్షకు కట్టింది.

## కథ, సశేషం

...రళి కూడా అప్పటికి ఇంటర్ పాసయి ఏడేళ్ళయింది. చిన్న చిన్న ఉద్యోగాలు చేస్తూ అనుభవం సంపాదిస్తున్నాడు. వనజ వాళ్ళ వీధిలోనే అతనూ వుండేవాడు. తల్లి వుంది. తండ్రి లేదు. అతనికి అయిదుగురు చెల్లెళ్ళు వున్నారు. చాలా చిన్నవాళ్ళు.

మురళి కూడా చాలా అందగాడు. పైగా మంచివాడు. వనజ నేర్చుకుంటున్న టైపు ఇన్‌స్టిట్యూట్‌లోనే అతనూ నేర్చుకుంటున్నాడు. మురళీ వాళ్ళకీ, భూషయ్యకు దూరపు బంధుత్వం కూడా వుందట.

వనజకు మురళితో కాస్త చనువు ఏర్పడింది. రెండు మూడుసార్లు ఇంటికి పిలుసుకు వెళ్ళింది. కాంతమ్మ ఏమీ అడ్డు చెప్పలేదు. మురళి వాళ్ళ అమ్మను 'వదినా' అని పిలిచేది కాంతమ్మ. మురళిని కూడా 'ఏవయ్యా, అల్లుడూ' అంటూ వుండేది.

కాంతమ్మ కూతురు కూడా పదిహేనేళ్ళ పిల్ల అయింది.

వనజ విపరీతంగా పుస్తకాలు చదవడం అలవాటు చేసుకుంది. నవల్లో నాయికలు, వాళ్ళ ప్రేమలూ, అనుభూతులు అనుక్షణం ఆమెను వెంటాడేవి. తన ఒంటరి తనాన్ని తెలుసుకుంటూ జంటకోసం మనసు వేదన పడేది. పద్నాలుగేళ్ల ప్రాయానికే శరీరం సెక్సు రుచి తెలుసుకుంది. తర్వాత చదువులో పడి మరిచిపోయింది. కానీ వయసు పెరుగుతున్నకొద్దీ తన శరీరం మరో శరీరం కోసం ఆరాటపడ సాగింది.

కానీ వనజకు చెడిపోవాలనిలేదు. సంఘంలో గౌరవంగా బతకాలని వుంది. అందుకు సరైన మార్గంలోనే తన కోర్కెను తీర్చుకోవాలనుకుంది. అందుకే మురళిని కదిపింది. కవ్వించింది.

మురళికి వనజ అంటే చాలా ఇష్టం. కానీ తనకు సరైన ఉద్యోగం లేకపోవడం లోటుగా కనిపించేది. పైగా తన మీద చాలా మంది ఆధారపడ్డంతో అతనికి సమస్య అయింది. వనజ ఓ బిడ్డను కన్నతల్లి అన్న చులకన భావం అతని మనసులో కొద్దిగా వుండేదేమో కూడా.

మురళి అరొందల మైళ్లకు అవతల ఓ టెంపరరీ ఉద్యోగం-కోసం వెళ్ళిపోయాడు. వనజ ఓ నిట్టూర్పు విడిచింది.

వనజ టైపూ, షార్టుహాండ్‌పాసయ్యింది. ఓ ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం దొరికింది.

భూషయ్య ఆరోగ్యం దెబ్బతినింది. కాంతమ్మ తన కూతురి పెళ్లి ప్రయత్నాలు మొదలుపెట్టింది. తన చాక చక్యంతో కూతురికి మంచి సంబంధం చూసి చేసింది. పెళ్లికొడుకు కూడా పెద్ద ఫ్యాన్సీషాపు యజమాని కొడుకు.

అనారోగ్య కారణంగా భూషయ్య వ్యాపారంలో దృష్టిని నిలపలేక పొయ్యాడు. సంపాదన బాగా తగ్గిపోసాగింది. కాంతిమ్మ ఇంటిలో ఎక్కువ భాగం అద్దెకిచ్చింది. దాని మీద రాబడి కాస్త ఫరవాలేదు. ఆర్నెల్ల తర్వాత భూషయ్య చనిపోయాడు.

వనజ పని చేస్తున్న ఆఫీసులో ఒకతను వనజతో ప్రేమ కబుర్లు చెప్పేవాడు. వనజ వింటూ కూర్చునేది. ఏన్నడూ చనువిచ్చేది కాదు. అదొక కాలక్షేపంలా, ఒంటరితనాన్ని మరచిపోవడానికి ప్రయత్నించేది.

అతగాడికి పెళ్లయిందన్న సంగతి చాలా కాలం తర్వాత తెలిసింది. అప్పుడు వనజకు నిజంగా కోపం వచ్చింది. తనకెందుకు చెప్పలేదని నిలదీసి అడిగింది. కానీ అతడు, భార్యకు విడాకులిచ్చి వనజను చేసుకుంటానని చెప్పాడు. వనజ అసహ్యించుకుంది. ఆ సంఘటనతో మానసికంగా కాస్త దెబ్బ తిన్నది.

| దీపావళి కథల పోటీలో |
| --- |
| రు. 600 లు |
| బహుమతి పొందిన కథ |

రంగారావు బస్ కండక్టరు. వనజ రోజూ ఆఫీసుకెళ్లాలంటే, అదే టైంలో వచ్చే రంగారావు బస్సు ఎక్కేది. రంగారావు వనజ వంక ఆరాధనగా చూసేవాడు. వనజ పట్టించుకోలేదు, చాలా కాలం వరకు. ఒక రోజు అతన్ని మొహమాటం లేకుండా అడిగింది, 'నన్ను పెళ్లి చేసుకుంటావా?' అని. దాని కతడు సంతోషంగా ఒప్పుకున్నాడు అంతే! పెళ్లయిపోయింది.

ఇది జరిగి ఏడాదయింది. రంగారావు వాళ్ల యూనియన్ సెక్రటరీ. రాజకీయాల్లో కూడా వున్నాడు. వనజ ఆ పాత కంపెనీలో మానేసి మరొక పెద్ద సంస్థలో ఎక్కువ జీతానికి చేరింది. జీవితంలో స్థిరపడ్డానను కుంది. ఆ సంతోషం ఎంతోకాలం నిలవ లేదు. పెళ్లయిన పది మాసాల్లోనే అతను ఒక రాజకీయ కొట్లాటల్లో బలంగా దెబ్బలు తిని చనిపోయాడు.

తలుపు తట్టాను. వనజ తలుపుతీసింది అప్పుడే మొహం కడుక్కొని వచ్చిందికాబోలు టవలుతో మొహం తుడుచుకుంటూ అంది 'రా! కూర్చో! ఎప్పుడొచ్చావు?'

టవలు ప్రక్కన పడేసి నాకొక కుర్చీ చూపించింది. వెళ్లి కూర్చున్నాను మౌనంగా. తనూ కూర్చుంది మరొక కుర్చీ లాక్కుని.

ఎంతోకాలంగా కలుసుకున్న తర్వాత నిజానికి కౌగిలించుకున్నంత పని చేసేవాళ్లం. కానీ నేను అలా చేయలేకపోయ్యాను. కారణం నాకే తెలియదు. మరి వనజ కూడా అంతే. కారణం తనకీ తెలియకపోవచ్చు.

'తమ్ముడి పెళ్లి, అందువల్ల వచ్చాను!' అన్నాను పొడిగా.

'విన్నాను. పెళ్లికి వస్తావని తెలుసు. కానీ ఇక్కడకు వస్తావనుకోలేదు!' అంది చిన్నగా నవ్వుతూ.

'ఎందుకలా అనుకుంటున్నావు ? వచ్చిన దగ్గర్నుండి నిన్ను చూడాలన్న తలంపే. మళ్లీ పెళ్లి చేసుకున్నావటగా...' అన్నాను.

వనజ నవ్వింది. 'మరి శుభాకాంక్షలు చెప్పవేం?'

నేను మాట్లాడలేదు.

'నేను మళ్లీ పెళ్లి చేసుకోడం నీకిష్టం లేదు. అవునా?' అంది సూటిగా చూస్తూ.

నా మనసుని బాగా గ్రహించింది. అందుకే మాట్లాడలేదు.

'పోనీ నీకు ఎలావుంటేఇష్టమో చెప్పనా? తెల్లటిచీర కట్టుకుని,మొహానబొట్టులేకుండా, కోరికలతో మిగిలిపోయి, కుళ్లిపోయి ఛస్తే బావుంటుంది. లేకపోతే కోరికలు తీరడం కోసం అందినవాడితో వెళుతూ, రోగాలతో రొప్పలతో చచ్చిపోవాలి. అంతేనా ?'

'అదికాదు!' అన్నాను బాధగా.

'భర్తపోయిన ఏడాదిలోనే మళ్లీ పెళ్లి చేసుకున్నాననన్న ఆలోచన తప్ప నీకు వేరే తప్పుపట్టే ఉద్దేశం లేకపోవచ్చు. నాకు పెళ్లి అవసరం నేను తల్లిని కావాలి. అన్నట్టు నీ పిల్లల్ని తీసుకు రాలేదేం ?'

'ఇంట్లో వదిలేసి వచ్చాను- మనం మాట్లాడుకోడానికి కుదరదని' అన్నాను

'నాకు చిన్నప్పుడే పెళ్లిచేసి సెక్స్ రుచి నేర్పారు. తల్లినయి నా బిడ్డ దక్కలేదు. ఇప్పుడు నా కెవరున్నారు? నన్నెవరు చూస్తారు?? అందుకే పెళ్లి చేసుకోదల



# వారఫలం

**14-11-1980 శుక్రవారం మొదలు**
**20-11-1980 గురువారం వరకు**

మేషం : శనిగ్రహం మీ రాశికి షష్ఠమస్థితి యందున్నాడు. అన్నివిధాలా యోగదాయకుడు. ధనలబ్ధికిగాని, వ్యాపార లాభానికి గాని, ఉద్యోగాన కాశాలకు గాని, విద్యాయోగ్యత సమకూర్చుటకు గాని, క్రీడారంగానుకూలతకుగాని, యోగదాయకుడు. స్త్రీలకు : శుభకార్యాలోచనలకు, ప్రయాణానుకూలత, కించిత్తు ధనాదాయానికి అనుకూల వారం.

వృషభం: గత వారానికన్నా, అన్నివిధాలా యోగమున్నది. పాత బాకీలు వసూలు కాగలవు. వ్యాపారం బాగా సాగుతుంది. రాజకీయవాదులకు అనుకూలమైన వారం. కళారంగ ఖ్యాతి అతిశయించగలదు. రచనా విధానంలో తృప్తి కనిపిస్తుంది. వృత్తితో ఆదాయం అనుకూలం గలవారం. స్త్రీలకు: గృహ సంబంధంగా చిక్కులు ప్రాప్తించనున్నవి. సుఖశాంతులు లోపించగలవు.

మిథునం: అధికారుల వలన జరగవలసిన పనులు చక్కగా నెరవేరతాయి. రాజకీయ వ్యవహారాలలో పరిచయమున్నవారికి, సత్ఫలితం ఆశించిన వారికి అనుకూల వారం. ఆరోగ్యం లోపించే అవకాశమున్నది. అర్ధాష్టమ శని ఇందులకు కారకుడు. స్త్రీలకు : విద్యా వైజ్ఞానిక రంగాలలో అనుకూలత, మాటకు విలువ పెరగటం, సభా గౌరవం లభించటం సంభవం.

కర్కాటకం : మీ తెలివి తేటలు రాణించే వారం. మీకు కళారంగ ఖ్యాతి, ప్రీతి అతిశయించగల వారం. పెద్దల అభిమానం, మీపై అధికారుల ఆదరణ లభించే వారం. మీరు రచయితలయితే, కొన్ని అవకాశాలుంటాయి. మీది వ్యాపార రంగమైతే, నూతనంగా భారీయెత్తున సరుకులు కొనుగోలు చేయగలరు. స్త్రీలకు : మానసికంగా అంత బాగుండేవారంగాదు. ఎలాగో, ధనలోపం మాత్రంలేదు.

సింహం: బాగా శ్రద్ధ చూపి పనులు సాధించుకోవాలి. అవసరములకు చాలినంత ధనలబ్ధికి మాత్రం లోపంలేదు. దైవకార్యాలు పుణ్యకార్యాలు నెరవేరే అవకాశమున్నది. మీ ఇంట శుభకార్యాన్ని గూర్చి చర్చలు సంభవం. స్త్రీలకు : శుభకార్య ప్రస్తావనలు, వృత్తి ఉద్యోగాలలో అనుకూలత, సభా గౌరవం, విలాస యాత్రానుకూలత గలవారం.

కన్య: రాశిలో గల రెండు గ్రహాలు, అనుకూలత చేకూర్చగలవు. విలాస యాత్రార్థం ప్రయాణించే అనుకూలత చేకూర్చగలవు. చాలమంది ఉద్యోగం నిమిత్తమో, వ్యాపార నిమిత్తమో, ప్రయాణించ గలరు. ఆరోగ్య లోపంలేదు. స్త్రీలకు : ప్రయత్నాలు ఫలిస్తాయి. చాలమందికి ఉద్యోగావకాశాలు ఉంటాయి అనటంలో ఆక్షేపణలేదు.

తుల: రావలసిన ధనం అందుతుంది. చాల సంతృప్తికరమయిన వారం. బుద్ధి బలం, విద్యా ప్రావీణ్యత, సుఖసంతోషాలకు ఆలవాలమైన వారం. కోర్టు వ్యవహారాలలో ప్రత్యర్థుల ఎత్తులకు పైయెత్తులు వేయగలరు. బాధల్లో ఉంటే మీకు అమృతప్రాయమైన విషయాలు వినగలరు. స్త్రీలకు: నగలు కొనటం, విలువైన బట్టలు కొనటం, విలాస యాత్రార్థం ప్రయాణించుట సంభవం.

వృశ్చికం: ఇంకా అశాంతికరమైన వాతావరణం అణిగిపోలేదు. సుఖశాంతులు అనుభవనీయమైన వారం గాదు. ఆప్తబంధువుకు కలిగిన నష్టం మీ మనస్సును కలతపెడుతూనే ఉంటుంది. దూర ప్రయాణాలు పెట్టుకోతగనివారం. స్త్రీలకు గృహానందం ఉన్నా, ఏవో చిక్కులుండగలవు. ఆరోగ్య విషయంలో శ్రద్ధ తీసుకొనటం ఎంతైనా అవసరం

ధనుస్సు : చాలా ఉత్సాహవంతమైన వారం ధైర్యంతో మీరు గావించిన పనులకు ప్రాబల్యం ఉండగలదు. భూములు, ఇళ్ళు మొదలైనవానిని కొనే ప్రయత్నాలుండగలవు. ప్రయాణంలో ప్రమాదమో! మీ తాలూకూ వస్తువులు పోవటమో! చెప్పదగిన వారం. స్త్రీలకు : అధికానందప్రదాయకమైన వారం. సుఖసంతోషాలుండగలవు.

మకరం: చాల విజయప్రదమైన వారం. వ్యవహార విజయమున్నది. మీ సత్యసంధత, న్యాయమార్గంలో నడవటం, మీకున్న యోగాభివృద్ధికి, కారకములు. విలువగల వస్తువులు, ఇనుప సామానులు, కొయ్య సామానులు కొనే ప్రయత్నం ఉంటుంది. విద్యా పరీక్షను ఫలవంతం. స్త్రీలకు : మిత్ర సహాయం, బంధుప్రీతి, ఆరోగ్యాభివృద్ధి. చెప్పదగిన వారం.

కుంభం: చాల విధాల ఇబ్బందులుండగలవు. ప్రశాంతత లోపించే వారం. ధనం చేతికి రావటానికి, రాదగిన దానికి కూడా అనేక విధాల చిక్కులుండగలవు. ముఖ్య విషయాలలో ఏకీభావం కుదిరే మార్గంలేదు. ప్రతి విషయంలో ఆలస్యం కావటం గమనించగలరు. స్త్రీలకు : వస్తు వాహనాలు కొనే ప్రయత్నం ఉంటుంది. ఆరోగ్య లోపంలేదు.

మీనం: మీరు ఎదురు చూచిన ధనం చేతి కందే అవకాశమున్నది. కుటుంబ సభ్యులలో కలతలు ఏర్పడే అవకాశమున్నది. యంత్రాల వల్ల, వాహనాల వల్ల ధనం వ్యయమయ్యే మార్గమున్నది. స్త్రీలకు: జరుగదగిన ప్రధాన విషయాలలో అనుకూలత గలదు. పెద్ద ఖర్చులు పైన పడుతవి. ఆరోగ్యం కూడ స్వల్పంగా లోపించగలదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

---

చాను. ఆ విధంగా తల్లినయితే నా కెంతో మనశ్శాంతి వుండేది. కానీ కోరిక తీరకుండానే అతను పోయాడు. అందుకే మళ్ళీ పెళ్ళి అవసరం అనిపించింది. ఒంటరిగా ఉద్యోగం చేస్తుంటే అందరూ పిలిచేవాళ్ళే. నా జీవితానికి రక్షణ లేదు. నా మనసుకు పూరట లేదు. నా శరీరానికి ఓదార్పు స్పర్శ లేదు. ఇవన్నీ వున్న నీకు, నా మూడో పెళ్ళి చాలా అసహ్యంగా కనిపించడం సహజం. నా మొదటి భర్తతో, పిల్లలతో హాయిగా వుంటూ, నాలాంటి ఆడది కనిపిస్తే బహుశా నేను కూడా అసహ్యించుకుంటానేమో కూడా. కానీ చెప్పాగా, నాకు మనశ్శాంతి లేదని. పెళ్ళితోనూ, తల్లినవడం తోనూ నాకు మనశ్శాంతి కలుగుతుంది' అంది.

## కథ, సశేషం

నేను మౌనంగా వున్నాను.

'అవును గానీ, నాకు పెళ్ళయిన సంగతి ఎవరు చెప్పారు?' అడిగింది.

'శోభ చెప్పింది!'

'నా గురించి అందరూ తెలుసుకుంటూనే వుంటారన్నమాట. చూసావా, ఒంటరిదానిమీద ఎన్ని కళ్ళో, ఎన్ని చెవులో? ఇవన్నీ భరించి ఎలా వుండనుంటావు చెప్పు?'

'నువ్వు తప్పు చేశావని నేను అనడంలేదు. కానీ సంఘానికి వ్యతిరేకమయిన పని చేసి నువ్వు అందరి దృష్టిలో చులకనైపోతే నాకు చాలా బాధగా వుంటుంది' అన్నాను.

'నా గురించి ఇంతగా బాధ పడుతున్న స్నేహితురాలు దొరికినందుకు చాలా సంతోషంగా వుంది. సరే, నీకూ సంతోషం కలిగించే విషయం ఒకటి చెప్తాను!' అంది.

'ఏమిటది ? తల్లిని కాబోతున్నావా ...?' అన్నాను.

'అదికాదు. నువ్వు అనుకున్నట్టుగా నాకు మూడో పెళ్ళి జరగలేదు !' అంది.

ఆశ్చర్యంగా వనజ వేపు చూశాను. 'పదిరోజుల క్రితం రిజిష్టరు మారేజి అయిందన్నారే !' అన్నాను.

'ఆరోజు అతను రిజిస్ట్రారు ఆఫీసుకు వస్తానన్నాడు. కానీ రాలేదు. ఆఫీసుకు శెలవు పెట్టి వెళ్ళాడు, వేరే ఒక కన్యను పెళ్ళి చేసుకునేందుకు ! అతని నిర్ణయాలు నిలకడ లేనివని ముందు గమనించలేకపోయాను, నా ఆత్రుతలో నేను వుండడం తప్పు!' నవ్వింది.

ఈసారి కూడా నేను బాధపడ్డాను.



# హైదరాబాదు నోట్‌బుక్

**యువనాయకుడు పి. రామచంద్ర :**

నాయకత్వం సేవకత్వం వల్లనే వస్తుందనే వారు గాంధిజీ. సేవకత్వమంటే ప్రజా సేవకత్వం. ప్రజలకు అన్నివేళల సన్నిహితుడుగా ఉండేవాడే నాయకుడవుతాడు. ప్రజలు నాయకుల నుంచి ఏవేవో జరుగుతాయని ఆశించరు. ఏమీ చేయకపోయినా, సన్నిహితుడుగా ఉన్నాడా లేదా, కష్టాలలో పరామర్శించాడా లేదా సుఖాల్లో పాలు పంచుకున్నాడా లేదా అనే చూస్తారు. అలా నిరంతరం ప్రజలకి సన్నిహితుడుగాఉంటూ సంపూర్ణ నాయకత్వానికి ఎదుగుతున్న యువ నాయకుడు శ్రీ పి. రామచంద్ర ఇటీవల అతనిని కలుసుకున్నప్పుడు నాకే ఆశ్చర్యమయింది. అలనాటి చిన్నవాడు ఇంతగా ఎలా వృద్ధికి వచ్చాడా? అని. పి. రామచంద్ర అనంతపురం కళాశాల పట్టభద్రుడు. కళాశాలలో ఉన్నప్పుడే సోషల్ సర్వీస్‌లీగ్ కార్యదర్శిగా పని చేశాడు. విద్యార్థి దశనుంచే రాజకీయాలలో ఆసక్తి మెండు ఇతనికి. పట్టభద్రుడైన తర్వాత యువజన కాంగ్రెస్‌లో చేరాడు. అనంతపురం జిల్లా యువజన కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా పని చేశాడు. కాంగ్రెస్ విభజన పిదప మంత్రి శ్రీ టి. హయగ్రీవాచారితోపాటు ఇందిరా వర్గంలో చేరాడు. శ్రీ హయగ్రీవాచారికి సంపూర్ణ భక్తుడు, ఆయన క్షేమమే తనకు శ్రీరామరక్ష అనే దృఢ విశ్వాసంగలవాడు. యువజన కాంగ్రెస్ రాయలసీమ ప్రాంతం ఆర్గనైజరుగా పని చేశాడు. ప్రస్తుతం రాష్ట్ర బాలల అకాడెమీ కార్యవర్గ సభ్యుడు. బాలల అకాడెమీ పక్షాన పెక్కు సమావేశాలు ఏర్పాటు చేశారు. అనంతపురంలో బాల భవన్ ఏర్పాటుకు ప్రయత్నాలు జరుపుతున్నారు. జిల్లాకొక బాల భవన్ ఏర్పడాలని అతని ఆశ. రామచంద్ర విద్యా వంతుడు. కష్టపడి పని చేసి, ప్రజల మన్ననలు పొందుతున్నవాడు. ముప్పై అయిదేళ్ళు దాటని వాడు. బరువు బాధ్యతలు వహించగల సమర్థుడు. కనుక ఉత్తరోత్తరా గొప్పగా ప్రజా సంస్థలు నిర్వహించగలడని ఆశిస్తున్నాను.

**సంగీత సరస్వతులు :**

"హెనహార బిరవానకే హెనాత చీకనే పాత" ("ముందు ముందు గొప్పగా పెరిగే చెట్టుకు మొక్కగా ఉన్నప్పుడే చిక్కని ఆకులు ఉంటాయి") అని హిందీ సామెత. భావి శుభోదయానికి మొదట్లోనే లక్షణాలు కనిపిస్తాయంటారు పెద్దలు. ఈ సామెతకు, పెద్దల మాటకు ప్రత్యక్షోదాహరణం చిరంజీవి ధూళిపాళ శ్రీనివాసమూర్తి, ఆయన సోదరీ సోదరులు, మాత్రుశ్రీ. వివిధ రాష్ట్రాల మహా వైణికుల వీణావాదనం వినేభాగ్యం నాకు కలిగింది. వీణ శేషణ్ణ, వీణ సుబ్బణ్ణ మున్నగు మైసూరు విద్వద్వైదికుల, వీణ వెంకట రమణయ్య ఈమని శంకరశాస్త్రి, వీణ ధనం మున్నగు., వారిని గురించి చిన్ననాటి కథలు ఎన్నో విన్నాను. దాదాపు వారంతా పదవ ఏటో, పదకొండో ఏటో కచ్చేరీలు చేసినవారనే విన్నాను. అవన్నీ వినడమే. కాని శ్రీ విద్యా సేవా సమితి శరన్నవరాత్రోత్సవం సందర్భంగా అక్టోబర్ 15 సాయంకాలం ధూళిపాళ శ్రీనివాసమూర్తి వీణావాదనం ప్రత్యక్షంగా విన్నాను, చూశాను. శ్రీనివాసమూర్తి వట్టుమని పది సంవత్సరాలు. వాయిస్తున్న వీణను నిలబెడితే, దానిలో సగం పొడుగు లేడు. కూర్చుని బార చాచితే, బారను మించి ఉందివీణ. 8వ తరగతి చదువుతున్నాడు. పది రాగాలను పెద్ద పెద్ద వారితో పోటీ పడేటట్లు వాయించాడు. కదన కుతూహలంలో 'రఘువంశ సుధాంబుధి చంద్రమా' పలికిస్తుంటే, మోరాయించిన సర్కసు గుర్రాన్ని అదుపులోకితెస్తున్న సాహిణి మారుడుగా కనిపించాడు. శ్రీనివాసమూర్తి పెద్దన్న శ్రీ డి. వి. ఎస్. శాయిరామ్ మొన్ననే బి. కాం. పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. వయస్సు 19 ఏళ్ళు. మృదంగం, ఘటం, కంజీరా, మోర్సింగ్ వాయిస్తాడు. ఐ.సి. డబ్ల్యు. చదువుతున్నాడు. మరొక అన్న డి. ఎస్. ఆర్. మూర్తి పదవ క్లాసు చదువుతున్నాడు, స్వామి వివేకానంద హైస్కూలులో. మృదంగం, ఘటం, కంజీర వాయిస్తాడు సుష్ఠుగా. వయస్సు 14 సంవత్సరాలు. అక్క కుమారి డి. ఎస్. మీనాక్షి రెడ్డి కాలేజీలో ఇంటర్ చదువుతున్నది. మృదంగం, ఘటం వాయిస్తుంది. వయస్సు 16 సంవత్సరాలు. చెల్లెలు కుమారి గీతా గాయత్రి. వయస్సు ఆరు నిండాయి. రెండవ తరగతి చదువుతున్నది. గీతాలు, కీర్తనలు గొంతెత్తి ఝామ్మని పాడుతుంది, శాస్త్రోక్తంగా. వీరి తల్లి శ్రీమతి డి. ఎల్. తులసీదేవి, వైణికురాలు. ఈమె నల్లకుంటలోని సాయి సంగీత విద్యాలయంలో వీణోపాధ్యాయిని. తండ్రి శ్రీ సుందరరావు సహకార శాఖలో సీనియర్ ఇన్‌స్పెక్టర్. ఈ విద్యాలయాన్ని శ్రీమతి శాయి మీనాక్షి నిర్వహిస్తూ, గాత్ర సంగీతం చెబుతారు. శ్రీమతి మీనాక్షి భర్త కీర్తిశేషుడు శ్రీ డి. జి. పద్మనాభం కూడా గొప్ప సంగీత విద్వాంసుడు. చిరంజీవి శ్రీనివాసమూర్తికి, అతని సోదరీ సోదరులకు ప్రజలు, ప్రభుత్వం మరి కొంత ప్రోత్సాహమిస్తే వారు గొప్ప సంగీత విద్వాంసులై రాష్ట్రానికి కీర్తి తేగలరని నా సంపూర్ణ విశ్వాసం.

**గాంధీ జయంతి :**

అక్టోబరు 2వ తేదీన గాంధి భవన్‌లో వివిధ సంఘాల ఆధ్వర్యాన జరిగిన సమావేశంలో గాంధిజీకి పలువురు శ్రద్ధాంజలులు ఘటించారు. అధ్యక్షత వహించిన ఒరిస్సా మాజీ గవర్నరు షాహ్ అక్బర్ అలీ ఖాన్, ఇతరులు గాంధిజీ జీవిత విశేషాలు తెలిపి, ఆయన సిద్ధాంతాలు నేటికీ అవసరమన్నారు. అంతకు ముందు చార్‌మినార్ నుంచి గాంధిభవన్ వరకు పూరేగింపులు జరిపారు.

**ఉపశ్రుతి :**

బదిలీ అయింది కదా! ఎక్కడున్నారు కాపురం? అనడిగాను మిత్రులు శ్రీ కంటీరవాచార్యులను. ఆఫీసులోనే ఉంటున్నాను అని ఆయన సమాధానమిచ్చారు. అదేమిటి? ఆఫీసులో ఎలా ఉండగలుగుతున్నారు? ఇంటికంటె గుడిపదిలం అన్నది సామెత. గుడికన్నా ఆఫీసు మరీ పదిలం అని సామెతను పొడిగించాను—అయన అన్నారు. ఆయనవ్యాఖ్యకు నోరు తెరచుకొని చూడడం నావంతయింది.

—తిరుమల రామచంద్ర



సీరియల్

# ప్రేమతీర్థం

—కళ్యాణి సోమరాజ్

(గతసంచిక తరువాయి)

"మీ మిసెస్‌ని రేపు తీసుకెళ్ళచ్చు. బాబుకేం పేరు పెడతారో చెప్పండి, మా రిజిస్టర్‌లో వ్రాసుకోవాలి" అని డాక్టర్ అడగటంతో—

"అలాగే, దీపని అడిగి చెబుతాను" అంటూ దీప రూమ్ వైపు నడిచాడు.

"ఏం దీపా! డాక్టర్‌గారు బాబుకి పేరేం పెడతారు అని అడుగుతున్నారు. ఏమిటి నీ ఉద్దేశ్యం?"

"నా ఉద్దేశ్యం ఎప్పుడో నీకు చెప్పాను. మళ్ళీ కావాలంటే చెబుతాను. బాబును కన్నంత మాత్రాన నేను తల్లిని కాను. మనసా వాచా నే నేనాడూ తల్లిని కావాలని అనుకోలేదు. నువ్వు ఆనాడు ఏమన్నావో గుర్తులేదా! బాబు బాధ్యత నాది అనలేదూ! ఆ బాధ్యత మొదలైంది అనుకొని పేరేదో నువ్వే పెట్టుకో. నీకు వాడిమీద ఇంట్రస్ట్ లేకపోతే చెప్పు, ఏ హోమ్‌లో అయినా చేర్పించి పోతాను." ధృఢంగా దీప ఒక్కొక్క విషయం చెబుతుంటే చంద్రానికి ఏమనాలో తెలియలేదు. లేడీ డాక్టర్ చెప్పిన విషయం దీపతో చెప్పేద్దామనిపించినా, దీప ఇప్పుడిప్పుడే కాస్త కోలుకుంటోంది. ఈ విషయం చెప్పి ఆమెను కృంగదీయటం మంచిది కాదని పూరుకున్నాడు.

"సరే. భరత్ అని పెడతాను. నీకు అభ్యంతరం వుండదుగా."

దీప మళ్ళీ ఏదో అనబోయి నవ్వి, "సారీ. నిన్ను నొప్పించానులా వుంది. నీకు పుణ్యం వుంటుందిగాని ఇక్కడ నుంచి నన్ను ఎప్పుడు విడుదల చేస్తారో కనుక్కో. పిచ్చెత్తిపోతోంది."

"మర్చేపోయాను, ఆ విషయం చెప్పాలనే వచ్చాను. సాయంకాలం కాస్త చల్లబడగానే వెళ్లిపోదాం" ఈ మాటలకి దీప తేలిగ్గా నిట్టూర్చింది.

*　　*　　*

రోజులు కనురెప్పపాటులో జరిగిపోతున్నాయి. భరత్ శారదమ్మ లాలనలో, చంద్రం వాత్సల్యంతో పువ్వులా పెరుగుతున్నాడు ఎవరి మనస్సైనా ఇట్టే దోచుకోగల శక్తి వాడి చిరునవ్వుకుంది. కాని వాడితల్లి మనసును మాత్రం గెలుచుకోలేకపోయాడు. ఒక్కసారైనా దీప ప్రేమగా ఎత్తుకోవటం ఎవరూ



చూడలేదు. పాలివ్వటం మినహాయించి మిగతా విషయాలన్నీ శారదమ్మ, చంద్రం చూసుకోవలసిందే.

"అదేమిటి దీపా! ఎంత లేదన్నా నువ్వు కన్నతల్లివి. అంత ద్వేషించటానికి ఆ పసివాడు ఏం నేరం చేసాడు." అంటూ శారదమ్మ వుండబట్టలేక అడిగినా, దీప, "లేదు పెద్దమ్మా! ఈ విషయంలో నన్ను వదిలెయ్యి. అయినా ఇంకా కొన్నాళ్ళలో వెళ్ళిపోబోతున్నదాన్ని. లేనిపోని మమకారాలు పెంచుకోవటం దేనికి!" అంటూ నిష్కర్షగా సమాధానం చెప్పేది. శారదమ్మ ఇక తర్కానికి దిగేది కాదు. ఆ రోజు దీపకి రెండు బరువైన కవర్లు వచ్చాయి. మొదటి ఉత్తరం చించితే, అది 'గ్లోరియా'నుంచి వచ్చిందిగా గుర్తించింది.

'అబ్బ! ఎంత ఓపిగ్గా పెద్ద ఉత్తరం వ్రాసిందో! ఈ పిల్ల కింత తీరిక ఎక్కడ చిక్కిందో?' అనుకుంటూ పేపర్లు మడతను విప్పింది.

మిస్ దీపా!

మీరేమిటి చూడబోతే ఇండియా వదిలి పెట్టి వచ్చేలా లేరు. అక్కడే ఏ రాజకుమారుడినో పెళ్ళాడి సెటిల్ అయ్యేలా వున్నారా కొంప తీసి? నేను ఈ మధ్య పెళ్ళిచేసుకున్నాను. అయితేనేమ అనుకున్నట్టుగాలతను ఇండియన్ కాదు. అమెరికన్నే! మా వివాహం అనుకోకుండా జరిగిపోయింది. అందుకని ముందు మీకు తెలియచేయలేక పోయాను. చాలా ఆశ్చర్యపోతున్నారు కదూ! నిజంగా నాకే వింతగా వుంటోంది. ఇంత త్వరగా పెళ్ళి చేసుకుంటానని నేను అనుకోలేదు. అతని పేరు రాబర్ట్. రాబర్ట్తో నా పరిచయం హాస్పిటల్లోనే జరిగింది.

ఆ రోజు నాది నైట్ డ్యూటీ. ఏదో రోడ్ యాక్సిడెంట్ అయిందనీ, అర్జెంటుగా ఒక పేషెంట్‌ని అడ్మిట్ చేసుకోమని ఎవరో వచ్చి చేర్పించారు రాబర్ట్‌ని.

నిద్రకళ్లతో, వివరాలన్నీ వ్రాసుకున్నాను పుస్తకంలో. అప్పుడు డ్యూటీలో వున్న డాక్టర్స్ ఇద్దరు అతనికి కట్టుకట్టి స్పెషల్ వార్డులో చేర్పించారు. తెల్లవార్లు అతని దగ్గర వుండాల్సిన డ్యూటీ నామీద పడింది. అతను మెలుకువ వచ్చినప్పుడల్లా ఏదో బాధతో మూలుగుతూనే వున్నాడు. మరునాడు రాబర్ట్ కళ్లు తెరిచాడు. అతనికి తగిలిన




# ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ వారి
# ఇంటింటా స్వంత గ్రంథాలయం ప్రణాళిక

























నువ్వు కట్టేదేమో 120 రూ.లు మాత్రమే! అదీ 12 తేలిక వాయిదాలలో!

| నీకు వచ్చేది | కలిసి వచ్చేది |
| --- | --- |
| నువ్వు కట్టే 120రూ.లకు | |
| 130 రూ.ల పుస్తకాలు | రూ. 10·00 |
| 8 ఉచిత పుస్తకాలు | 28·00 |
| పెద్ద కేటలాగు | 2·00 |
| ఉచిత తపాలా సౌకర్యం | 15·00 |
| | రూ. 55·00 |








## 15-12-80 లోపు చందాదారులుగా చేరినవారికి ప్రత్యేక సదుపాయం!

మొదటినెల వచ్చే ఉచిత పుస్తకాల (వెల రూ.7) బదులు ఈ దిగువ ఇచ్చిన 5 ఛాయిస్‌లలో ఒకటి ఎన్నుకొని సుమారు 8 రూ.ల అదనపు లాభం పొందవచ్చు. ఈ సదుపాయం 15-12-'80 లోపు చందాదారులుగా చేరిన వారికి మాత్రమే! (ఆ తర్వాత చేరినవారికి కేవలం 2 ఎమెస్కో పాకెట్ బుక్స్ (7 రూ.ల విలువగలిగినవి) మాత్రమే ఉచితంగా వస్తాయి. లేదా – 15-12-'80 తర్వాత చేరినవారు వీటిలోనుంచి ఎన్నుకోదలిస్తే మొదటి నెల చందాగా రూ. 15/-లు పంపాల్సి వుంటుంది.

| ఛాయిస్ నెంబర్ | మొదటి ఉచిత పుస్తకాల జాబితా! | |
|---|---|---|
| ① | నీరాజనం - యద్దనపూడి సులోచనారాణి | రూ. 15.00 |
| ② I | పసుపు తాడు - (ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి | 12.00 |
| II | ఎమెస్కో పాకెట్ తెలుగు-ఇంగ్లీష్ డిక్షనరీ - బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు | 4.00 |
| ③ I | బొమ్మరిల్లు - వాసిరెడ్డి సీతాదేవి | 9.00 |
| II | భాగవతం - పోలంకి వెంకట రామచంద్రమూర్తి | 6.00 |
| ④ I | ఎమెస్కో బొమ్మల పంచతంత్రం - పోలంకి వెంకట రామచంద్రమూర్తి | 10.00 |
| II | నాలో సేవర్ బ్రహ్మచారి - డా॥ కొర్రపాటి గంగాధరరావు | 5.00 |
| ⑤ I | రాజీ - 'నీర' | 11.00 |
| II | చరిత్రకెక్కిన చరితార్థులు - చల్లా రాధాకృష్ణశర్మ | 4.00 |



### మరో సదుపాయం!

15-12-'80 లోపు చందాదారులుగా చేరిన వారి నంబర్లన్నిటినీ లాటరీలో వేసి డ్రా తీస్తాము. డ్రాలో వచ్చిన మొదటి 10 నంబర్ల చందాదార్లు మిగతా చందా 110/- రూ.లు కట్టకుండానే వారికి మొత్తం పుస్తకాలు పంపిస్తాము.

డ్రా వివరాలు HLP న్యూస్ లెటర్ ద్వారా తెలియపరుస్తాము

### చందాదారులుగా చేరే విధానం......

మొదటి నెల చందా రూ.10/- M.O. చేస్తూ పక్కన ఇచ్చిన కూపనులో గాని, పోస్టుకార్డుమీద గాని, M.O. కూపను మీద గాని మీకు కావలసిన పుస్తకాల ఛాయిస్ నంబరును గుర్తించి క్రింది చిరునామాకు పంపండి!

**ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్**
3237, రాష్ట్రపతి రోడ్,
సికింద్రాబాద్
500 003

ఎ.పి.బి.డి. వారికి –
అయ్యా – మీరు నిర్వహిస్తున్న 'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళికలో నన్నొక చందాదారునిగా చేర్చుకోవలసిందిగా కోరుతున్నాను. పథకం తాలూకు నిబంధనలకి బద్ధుడనై వుంటాను. మొదటినెల చందా 10/- రూ.లు M.O. గా పంపి వున్నాను.
రసీదు నెం: .......... తేదీ ..........
మొదటి ఉచిత పుస్తకాలకి గాను (✓) గుర్తించిన ఛాయిస్ నెంబర్‌లోని పుస్తకాలు పంపండి

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|

పేరు:

చిరునామా



దెబ్బలు పెద్దగా ప్రమాదమైనవి కాకపోవటం వలన, రాబర్ట్ త్వరగానే కోలుకున్నాడు. కాని యాక్సిడెంట్ అయిన షాక్ మూలంగా అతని గొంతు కాస్తా పోయింది. అది మాత్రం డాక్టర్స్ ఎంత ప్రయత్నించినా రాలేదు. కొత్తగా వచ్చిన ఈ మూగతనం వలన అతను పిచ్చివాడైయ్యాడు, అనచ్చు! అతన్నిచూస్తే ఎందుకో, వోదార్చాలనిపించేది. నాకేం సంబంధం అన్నట్లు వుండలేక పోయాను.

ఆ తరువాత అతని వివరాలన్నీ కాగితం మీద వ్రాసి ఇచ్చాడు. ఇక్కడకు వందమైళ్ల దూరంలో తల్లి మఃఒకు వుందిట. అక్కడే అతనికి చిన్న ఫరం వుందిట. ప్రతివారం న్యూయార్క్ వచ్చి తన ఫరమ్‌కు కావాల్సిన వన్నీ కొనుక్కుపోతూ వుంటాడట. ఈసారి దురదృష్టం అతన్ని వెనక్కుపోనీలేదన్నమాట. "మీ తల్లికి కబురు చేయమంటారా" అని నేను అడిగిన ప్రశ్నకు కళ్లతోనే వద్దని వారించాడు.

అతను ఇంచుమించు నె ల రో జు లు హాస్పెటల్లో వున్నాడు. ఈనెల రోజులు నేను ఎప్పుడు డ్యూటీ కెళ్లినా, అతను మెరిసే కళ్ళతో నాకు స్వాగతం చెప్పటంచూసి, నేను నవ్వుకునేదాన్ని! నేను అతని ఛార్జిషీట్ వ్రాస్తున్నంతసేపు ఆనందంతో అతని కళ్లు నన్ను అంటిపెట్టుకునే వుండేవి. నేను డ్యూటీ నుంచి వచ్చేస్తుంటే నిరాశతో కళ్లు మూసుకుని పడుకొనేవాడు. రాను రాను నా

# ప్రేమ తీర్థం

మనసు కూడ అతని పరిసరాల్లోనే వుండాలని కోరుకునేది ఎందుకో!

నాకు తెలియకుండానే, ఏదో ప్రేమ పుష్పం నా మనసులో విచ్చుకుంటున్నదని పించేది. రాబర్ట్ చూడటానికి అందగాడే, కాని అతను మూగవాడు. గొంతు వస్తుందని నమ్మకం లేదు. ఇలాటి ప్రేమ అభివృద్ధి చెందదు అంటూ నన్ను అంతరాత్మ నిరుత్సాహ పరిచేది! ఈ సంఘర్షణ మధ్య నేనుండగా, అతను డిశ్చార్జ్ అయ్యేరోజు దగ్గర కొచ్చింది. అతను నన్ను ఏదో అడగాలని ఏదో ఆరాటంగా నావంక చూసేవాడు, కాని నేను అక్కడ వుండకుండా తప్పుకొనే దాన్ని! ఇక అక్కడ వుండలేక ఆ మరునాడు నుంచి మరొక వార్డ్ కి మార్పించుకున్నాను.

ఆరోజు అతన్ని డిశ్చార్జ్ చేశారని ఒక నర్స్‌ని అడిగి తెలుసుకున్నాను. మనసుకి కళ్ళెం వెయ్యలేక చాలా అవస్థ పడుతున్నాను. అతను బహుశ వెనక్కు వెనక్కు చూసుకుంటూ హాస్పిటల్ గేటుదాటి వుంటాడు అని వూహించుకుంటున్న నాకు, నా రూమ్ గుమ్మం ముందు రాబర్ట్ నిలబడి వుండటం గమనించాను. ఏదో చెప్పాలని నోరు తెరిచి ఆత్రుతగా వెళ్ళాను. కాని నా మ న సు ను ఎవరో సంకెళ్ళతో ఆపినట్లనిపించింది. అతను పూల బుట్ట నా కందించి ఒక్క నిముషం




నా వంక చూసాడు. నేను గబుక్కున తల వంచుకొని పూలలో ఏదో వెతుకుతున్నట్లు మొహం పెట్టుకొని "గుడ్‌బై" అన్నాను బలవంతంగా! ఆ తరువాత వెను తిరిగి చూడకుండా గబగబా అడుగులేసుకుంటూ వెళ్ళిపోయాడు.

ఈ సంఘటన జరిగాక, అతను నా మనసులోంచి చెరిగిపోటానికి బదులు మరింత గాఢంగా ముద్ర వేసుకున్నాడు. నేనో నిర్ణయానికి రాక తప్పలేదు. అతని అడ్రస్ తెలుసుకొని, అతనింటికి వెళ్ళాను. అతను పచ్చగా తడిగా వున్న లాన్‌లో కుర్చీలో కూర్చుని పేపరు చదువు కుంటున్నాడు.

నా అడుగుల సవ్వడికి చివ్వున తలత్రిప్పిన అతని కళ్లల్లో ఒక్కసారి వెయ్యి కాంతులు విరజిమ్మాయి. మెరుపులా నా దగ్గరకు పరిగెత్తుకొచ్చి నన్ను ముద్దులతో ముంచెత్తాడు రాబర్ట్! అతను మాట్లాడలేక పోయినా, కళ్లల్లో అతను కనబరిచిన భావాలు నేను చదవగలిగాను. "నాకు తెలుసు, ఏదోఒక రోజు నన్ను వెతుక్కుంటూ నువ్వొస్తావని" రాబర్ట్ తల్లి అనుమతితో మే మి ద్ద రం వివాహం చేసుకున్నాం. వారం రోజుల క్రితం హనీమూన్ నుంచి తిరిగివచ్చాము. ఈ వూళ్లోనే వున్న హా స్పె ట ల్లో నర్స్‌గా జాయినవుదామనుకుంటున్నాను నేను. అతను ఒక అసిస్టెంట్ సహాయంతో తన బిజినెస్ చూసుకుంటున్నాడు.

దీపా! ఇప్పుడు జీవితంలో సంతృప్తి కనిపిస్తోంది! నా భర్త అందరిలా హాయిగా కబుర్లు చెప్పలేకపోవచ్చు. కాని అతని సాన్నిధ్యంలో నాకు గంటలు నిముషాల్లా దొర్లిపోతున్నాయి. అతనికి ఎప్పుడైనా కోపం వస్తే చెయి ఝుళిపిస్తాడు. అది చూసి నేను నవ్వేస్తే, అతను నవ్వుతాడు. అతని మనసులో ఏమీలేదు, నామీద ప్రేమ తప్ప. అది చాలు నా హృదయం నిండటానికి.

చిన్న సలహా! మీక్కూడా ఏదో ఒకరోజు మీ హృదయాన్ని కదిలించి, మైమరపించే వారు తటస్థపడవచ్చు. అలాటి క్షణాలు వృథా ఆలోచనలతో వేస్ట్ చేసుకోకండి. ఒక మాల తెచ్చి మెళ్లోవేసి మీ సమ్మతిని తెల్పండి! నవ్వుతున్నారా! ఎప్పుడొస్తారు ఇక్కడికి. వచ్చాక మా ఇంట్లో కొన్నాళ్లు గెస్ట్‌గా

వుండాలి. రాబర్ట్‌కి ఫ్రెండ్స్ అంటే ఇష్టం.

సరే, ఇక వుంటాను.

మీ గ్లోరీ రాబర్ట్.

దీప మనసు ఆనందంగా నిట్టూర్చింది. గ్లోరియా అమాయకపు పిల్ల అనుకుంది. ఎంత ధైర్యంగా తన బాటను తాను ఎన్ను కుంది!

మరొక ఉత్తరం తీసి చింపింది, అది తల్లి వ్రాసిన ఉత్తరం.

ప్రియమైన దీపకు!

నువ్వు ఆరోగ్యంగా వున్నావని తలుస్తాను. నేను, మీ నాన్నగారు, తమ్ముడు అందరం నీ రాకకోసం తపిస్తున్నాము. ఎప్పుడొస్తున్నావు?

మీ నాన్నగారు దీనితో చెక్ పంపిస్తున్నారు. టిక్కెట్టుకొని, ఏ రోజు వస్తావుందీ తెలియపరచు. ఆలశ్యం చేయకు.

'బాబు'ని పెంచుకుంటానన్న అతను అదే మాటమీద వుంటే, బాబుని ఇచ్చేసెయ్యి. లేకపోతే అనాధాశ్రమంలో చేర్పించి కొంత డబ్బు డొనేట్ చేసెయ్యి. ఒకవేళ బాబుని వదలలేకపోతే, బాబుని తీసుకుని రా. కాని... నీ భవిష్యత్తుకి వాడు ఒక గొడ్డలి పెట్టు అని మాత్రం మరచిపోవద్దు. నీకు నాన్నగారు చాలా సీరియస్‌గా సంబంధాలు చూస్తున్నారు. నువ్వు రాగానే ఏదో ఒకటి సెటిల్ చేద్దాం అనుకుంటున్నారు. బాగాఆలోచించి ఒక నిర్ణయానికి రా! ఇప్పుడే పిల్లల కోసం బెంగపడే వయసు కాదు నీది. 'నా కొడుక'ని ధైర్యంగా చెప్పగలిగే పరిస్థితికాదు. కాబట్టి, గుండె రాయి చేసుకొని బాబుని అక్కడే వదిలివేయమని నా సలహా! తరువాత నీ యిష్టం.

నీ రాక కోసం మేమంతా ఎదురు చూస్తున్నాం. అన్నట్టు నీ పుట్టిన రోజు శుభాకాంక్షలు.

ప్రేమతో,
అమ్మ.

తల్లికి తన గురించి, తన భవిష్యత్ గురించి ఎంత బెంగ! ఒక్కక్షణం దీప కళ్ళు నీళ్లతో నిండు కున్నాయి. వెళ్లిపోవాలి! రెక్కలుంటే ఈ నిముషంలో ఎగిరి తల్లి ఒళ్లో వాలి, "అమ్మా నేను వచ్చేసాను" అనాలి. ఎన్నాళ్ళో అయిందని పిస్తోంది తన వాళ్లందర్ని చూసి. అందులో అమ్మ వ్రాస్తే గుర్తు వచ్చింది. ఈరోజు తన బర్త్‌డే!




గుర్తు కూడా లేదు. ఎన్నో పుట్టినరోజు పండుగలు హాయిగా గడిపింది. అమ్మ ఈరోజు చేసే హంగామా అంతా గుర్తు వచ్చి మనసు నిండుగా నవ్వుకొంది! తన బర్త్‌డే ముందర రెండు మూడు రోజుల నుంచే అమ్మ హడావిడిగా అవీ, ఇవీ చేస్తూ, ఇల్లంతా ఇటుఅటు సర్దుతూ, చాలా ఖంగారు పడేది. తెలిసిన తెలుగు ఫ్యామిలీస్‌కి ఫోన్స్ చేసి రమ్మని ఆహ్వానించేది. తన బర్త్‌డే కేక్ దగ్గరనుంచీ తనే చేసేది. ఒకసారి తను ఉండబట్టలేక, కేక్ మీద 'ఐసింగ్' చేస్తూ తన పేరు చెక్కుతున్న తల్లితో, "పోనీ మమ్మీ, ఇవన్నీ బయట కొనుక్కుంటే పోదూ! ఇంత కష్టపట్టం ఎందుకు ప్రతి బర్త్‌డేకి" అంది.

"నిన్ను కనేముందర కూడా చాల కష్టపడ్డానే దీపా! కాని నీ మొహం చూసేసరికి నే పడ్డ బాధంతా మరిచేపోయాను. సరేలే. నీ కర్థం కాదులే తల్లుల సైకాలజీ. పోయి మీ ఫ్రెండ్స్‌ని ఎవరెవర్ని పిలవాలో లిస్ట్ వేసుకో!" అంటూ సున్నితంగా పంపేసేది.

తనకు ఆనాడు అమ్మ మాటలు అర్థం కాకపోయినా, 'మా మమ్మీ స్వీట్ మమ్మీ' అంటూ తల్లి చెక్కిలి మీద ముద్దు పెట్టుకొంది.

వెంటనే తల్లి చెప్పినట్లు టిక్కెట్టు కొనేసెయ్యాలి. ఇక ఆలశ్యం చేయకూడదు. అంటు గట్టిగా నిశ్చయానికి వచ్చేసింది దీప!

ఇంతలో లోపల నుంచి 'భరత్' ఏడుపు గట్టిగా వినిపిస్తోంది. దీప విసుగ్గా వాచీ చూసుకొని 'ఇప్పుడు పాల టైమ్ కూడా కాదే. వీడికేం పనిలేదు' అనుకుంటూ 'పెద్దమ్మా, పెద్దమ్మా'! అంటూ గట్టిగా కేకవేసింది. లోపల నుంచి సమాధానం ఏమీ రాలేదు. కాని బాబు ఏడుపు శృతి పెరిగింది. దీప చేసేది లేక బాబు దగ్గరకు నడిచింది. బాబు మొఖంమీద గుడ్డ వేసుకొని, ఊపిరాడక ఏడుస్తున్నాడు. దీప ఖంగారుగా గుడ్డ తీసేసింది. అయినా ఏడుపు ఆగలేదు. ఎందుకో ఒక్క క్షణం జాలి అనిపించింది. తనక్కాకుండా, యింకెవరికైనా పుడితే చాలా అపురూపంగా పెరిగేవాడేమో! అన్పించింది. చేసేది లేక ఎత్తుకొని బయటకు తీసుకొచ్చింది. సరిగ్గా అదే సమయానికి చంద్రం గేటు తీసుకొని లోపలికి వస్తూ, దీప చేతిలో బాబుని చూసి చాలా సంతోషించాడు.

"చాలా రోజులకు ఒక సుందర దృశ్యాన్ని చూసాను" అన్నాడు.

"ఏమిటది ?" అంది దీప, చంద్రాన్ని చూస్తూనే 'అమ్మయ్య' అనుకుంటూ.

"మీ చేతిలో భరత్."

"నా మొహం. పెద్దమ్మ ఎక్కడికి వెళ్ళిందో కన్పించలేదు. పోన్లే ఇక గొడవ లేదు. కాస్సేపు తీసుకో" అంటూ అందించింది. చంద్రం ఆపేక్షగా తీసుకొన్నాడు. కాని బాబు తల్లి వంకే ఆశగా చూస్తున్నాడు. అది గమనించి చంద్రం "చూడు



# ప్రేమ తర్గం

దీపా ! బాబు ఎంతైనా నీ కొడుకే. ఎలా నీ వంక చూస్తున్నాడో.''

''అది సరేగాని, నీకో పని తగిలింది.''

''ఏమిటది.''

''ఏమిలేదు. ఈ దేశానికి వచ్చే ముందు ఎలా స్వాగతం చెప్పావో, అలాగే ఈ అతిథికి వీడ్కోలు చెప్పే బాధ్యత కూడ నీ మీదే వుంది.''

''అంతేకాదు, మరో బాధ్యత కూడ నామీదే వుంది.''

''ఏమిటది'' ఆశ్చర్యంగా అంది దీప.

''ఇప్పుడు కాదులే, తరువాత చెబుతాను. ఇంతకీ ఎప్పుడు వెళ్లేది డేట్ నిశ్చయం అయిందా?''

''ఊహూఁ అదేం కాలేదు. పెద్దమ్మతో చెప్పి నిర్ణయించాలి. దానికితోడు మళ్లీ నా వీసా వగైరా ఆ గొడవంతావుందిగా! దాని గురించి హైదరాబాదు వెళ్లాలేమో !''

''సరే చూద్దాం. ఈ వీకెండ్ లో హైద్రాబాద్ వెళ్లాల్సిన అవసరం నాకువస్తే ఇద్దరం కలిసి వెళదాం.''

''ఎక్కడికి కలిసివెళదాం అంటున్నారు?'' అంటూ శారదమ్మ గేటు తీసుకొని లోపలికి వచ్చింది.

''దీప వెళ్లిపోతానంటోంది.''

''ఏమిటే ! అప్పుడే ప్రయాణమా? నిన్న గాక మొన్న వచ్చినట్లుంది. అంత తొందరేమిటే !'' శారదమ్మ మనసు బెంగతో మూగబోయింది.

''అదేమిటి పెద్దమ్మా ! అప్పుడే అంటావు. అమ్మకి మాత్రం చాలా ఏళ్లైనట్లుందిట. ఇక వెళతాను పెద్దమ్మా.''

''సరే నీ యిష్టం తల్లీ ! ఇంతకీ బాబునేం చేద్దామని?''

''అదంతా చంద్రం చూసుకుంటాడు.''

''ఔను పెద్దమ్మా ! బాబు విషయం నాకే వదిలేయండి'' అన్నాడు సాలోచనగా.

శారదమ్మ మనసు కొంచెం నెమ్మదించింది !

(ఇంకా వుంది)

# ఓం శ్రీ మాత్రే నమః

# నవశక్తి నిలయంనుంచి భక్తుల వినూత్న అవకాశము

## దైవదత్తమైన వస్తువుల రూపొందించు సంస్థ

### శ్రీశ్రీ జగద్గురువులు కంచి, శృంగేరి, గొండలస్వామివార్ల ఆశీర్వాదముతో

## I. చక్రములు-పూజకొరకు : (అధిష్టానదేవత వివరములు, ఉపయోగించు పద్ధతితో సహా)

★ 1. శ్రీ మహా మేరు (పంచ లోహములు) 4 సెం. మీ. 4 సెం. మీ. వెల రూ. 215—00

★ 2. శ్రీ చక్రం (రాగి) 8 సెం. మీ. 8 సెం. మీ. వెల రూ. 105—00 (శ్రీ మహామేరు మరియు శ్రీ చక్రం యొక్క అధిష్టాన దేవత శ్రీ లలితా త్రిపుర సుందరి

పూర్వ పుణ్య విశేషము గలవారు మాత్రమే ఈ పూజ చేయు సంకల్పమును కలిగి ఉందురు. అత్యంత శక్తివంతమైన యంత్రము. ఈ పూజ వలన సంపద, సౌభాగ్యము, విజయముచేకూరగలవు. కులము, మతము, లింగ భేదములు లేక ఎవరైనను పూజ సలుపవచ్చును.

★ 3. ధనరక్షణ చక్రం : లక్ష్మీదేవి అధిష్టాన దైవం. ఈ పూజ చేయువారికి అంతులేని ధనము, సంపద, సుఖసంతోషాలను, అనుగ్రహించగలదు. (రూ. 105—00)

★ 4. శ్రీ మహా గణపతి చక్రం :— ఈ చక్రమునకు అధిష్టాన దైవం శ్రీ మహాగణపతి, అన్ని విధములైన కష్టాలనుంచి, బాధలనుంచి వెంటనే విముక్తి గలిగించును. తలపెట్టిన అన్ని కార్యములు నిర్విఘ్నముగా పూర్తగునట్లు తోడ్పడును. (రు. 105—00)

★ 5. శ్రీ సుబ్రహ్మణ్య చక్రం : శ్రీ సుబ్రహ్మణ్యస్వామి అధిష్టాన దైవతము. శరీరకబాధలు, భూత ప్రేతదయ్యముల నుంచి భయమును బాధను తొలగించును. పిచ్చి, నరముల దవుర్బల్యము, దుష్టగ్రహ బాధలు, గాలి చేష్టలు, మొదలైన అన్ని పీడలను ఈ పూజ వలన తొలగించుకొని సుఖముగా ఉండవచ్చును. (రు. 105—00)

★ 6. బాల మహా త్రిపురసుందరి చక్రం : ఈ చక్రము యొక్క అధిష్టాన దేవత తొమ్మిదిశక్తుల చిన్న దైవ బాలత్రిపుర సుందరి. అత్యంత మహిమాన్వితమైను దేవత. 48 దినములు నియమానుసారము పూజసల్పినవారికి అష్ట మహాసిద్ధులు లభింపజేసి పేరుప్రఖ్యాతూ సౌభాగ్యమును సిద్ధింపజేయును. శ్రీ విద్యా పూజకు ఇది నాంది. (రు. 105—00)

★ 7. దృష్టి నివర్తి యంత్రము: ఆధునిక కాలమునకు మిక్కిలి ఉపయుక్తమైనది. భగవాన్ దత్తాత్రేయస్వామి వారిచేలోకమునకు ఈ యంత్రము ప్రసాదించబడినది. ఈ యంత్రమును కలిగియున్నవారికి, దుష్ట శక్తుల ప్రభావాన్ని తొలగించి, దృష్టిదోషమును హరించి ప్రమాదములు మొదలైనవి జరుగకుండాను, ఎటువంటి ఒడుదుడుకులు, కష్టములు సంభవించకుండా కాపాడును. గృహములోగాని, కార్యాలయములో గాని, దుకాణములోగాని, కారు లారి, స్కూటరు (రోడ్డు ప్రమాదాల నివారణకు) కూడ ఉంచుకొనవచ్చును. వ్యాపారంలో లాభాన్ని అభివృద్ధిపరచి గృహములో సౌభాగ్యమును పెంపొందించును. (రు. 42—00)

## II. వెండి దేవతామూర్తులుగల డాలర్లు : (శరీరముపై ధరించుటకు)

★ 8. శ్రీ కామాక్షి డాలర్ (విజయము, సంపద, సౌభాగ్యములు, సంతోషములకు) రు. 45—00.

★ 9. శ్రీదేవి కరుమారి డాలర్ (లోక శ్రేయస్సుకు, శత్రు జయమునకు) రు. 45—00

★10. వివాహప్రాప్తి డాలర్ (శీఘ్ర కల్యాణానికి, ప్రేమ విజయానికి) రు. 45—00 మీ నక్షత్రము తెలియపర్చిన విధల మీ పేర పూజ చేయబడును. 108 రోజులలో ఫలితము ఇవ్వగలదు.) రు. 35—00

★11. ధనప్రాప్తి డాలర్ (సర్వ సంపదలు, ధనము, భాగ్య లాభమునకు) రు. 35—00

★12. బాలారిష్టము డాలరు (1 నుంచి 7 ఏండ్ల వయసు గల పిల్లలు ధరించుటకు కకువాయి దగ్గు, ఫిట్సు, ఇతర చిన్న బిడ్డ చేష్టలకును రూపుమాపును). రు. 25—00

★13. మాంగల్య భాగ్య డాలరు (స్త్రీల ధారణకు) భర్త దీర్ఘాయువునకు, సంతోషకరమైన వివాహ జీవితమునకు) రు. 35—00

★14. దృషి నివృత్తి డాలరు (అన్ని రకముల దృష్టి దోషములు తొలగించును (పై 7వ ఐటం చూడుము) రు. 35—00

★15. జపమాలలు : (a) అసలు రుద్రాక్షమాల (54) వెండి తీగెతో రూ. 100—00
(b) స్పటికమాల (54) డిటో 60—00
(c) తులసి మాల (54) డిటో 60—00

మీరు ఆర్డరు పంపునపుడు వస్తువు వెలలో 50 శాతమును, ఆర్డరుతో పంపవలెను. వస్తువును, పూజ చేసిన అనంతరము వి. పి. పి. ద్వారా మీకు పంపబడుతుంది. ఆర్డరు యిచ్చునపుడు మీ జన్మ నక్షత్రము పేరును తప్పక తెలియచేయండి.

ఉత్తరప్రత్యుత్తరాలు ఇంగ్లీషులో మాత్రమే.

**Visvakarmagnya Swami Sri S. T. MurugaBushanam,**
Sri Vidya Upasaka and President,
**NAVASAKTHI NILAYAM,**
153, Lloyds Road (Opp. to State Bank), GOPALAPURAM,
**MADRAS-600086,** (Phone : 812013.)












Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Stree
Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishn-

# "ఈగిల్ ఫైన్నెస్ గురించి వేరే చెప్పాలా?"






**"ఇది అందమైనది..."**

ఆతిథ్యం ఇచ్చే మోహనాంగి.

**"ఇది అద్వితీయమైనది..."**

దుమ్మును ఏమాత్రం లోనికి పోనివ్వదు...24 గంటలకు పైగా వేడిని ఏమాత్రం బయటికి రానివ్వదు.




**"మరేమిటనుకున్నారు, ఇది ఈగిల్ వాక్యూమ్ ఫ్లాస్క్."**




**ఈగిల్ శ్రేణిలో 123 వేర్వేరు నమూనాలు.**

CASE-113-244-TEL

